అన్నివిధాల మహోన్నతం

ఏవి.ఎం. ప్రొడక్షన్సు వారి

మొదటి తెనుగు చిత్రం

# జీవితం

(లైఫ్)

డైరెక్షన్:
ఎం.వి.రామన్

జూలై 14వ తారీఖు

AVM ప్రొడక్షన్సు

ఆంధ్రా-సీడెడ్-నైజాములకు : రాజశ్రీ పిక్చర్సు లిమిటెడ్, బెజవాడ అండ్ సికింద్రాబాద్
మైసూరు స్టేటుకు : తల్లం పిక్చర్స్ సర్క్యూట్ :: బెంగళూరు సిటీ.
మదరాసు సిటీకి : నేషనల్ పిక్చర్స్ :: మదరాసు అండ్ వెల్లూరు.
... తమిళనాడుకు : సరస్వతీ టాకీ డిస్ట్రిబ్యూటర్స్ :: మధుర ...

# చందూ యొక్క సాహసకృత్యములు



















ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

మనం తెలుసుకొన
వలసిన వింతలు ఎన్నో వున్నయి. వీటిని
చందమామ పాఠకులు తెలుసుకోవాలనే ఆసక్తితో
'ఎందుకో తెలుసా?' అనే శీర్షికకింద 'కథల తాతయ్య'
కొన్ని వింతలు చెప్పటం ప్రారంభించాడు. 'కుక్కముక్కు చల్లగా
వుంటుంది' అనే కథను కిందటినెల, 'నెమలి ఈకలను కన్నులు
అంటారు' అనేకథను ఈ నెలా కథల తాతయ్య చెప్పగా మీరు విన్నారు.
ఇటువంటి చిన్న గాథలను మా పాఠకులే కృషిచేసి వ్రాసి పంపాలని కథల
తాతయ్య వుద్దేశం. కనుక ప్రతినెలా ఒక్కొక విషయం ఇస్తూవుంటాము.
ఆ విషయాన్నిగురించి మీరు చెప్పగల చక్కటి కథ వ్రాసి పంపండి. మాకు
చేరిన వాటిల్లో ఉత్తమమైన కథను ప్రకటించి, కథకునికి బహుమతికూడ
ఇస్తాము. ఆగస్టునెలకు "కోడి నేలమీద అస్తమానం కెలుకుతూ
వుంటుంది—ఎందుకో తెలుసా?" అనే విషయాన్నిగురించి మీకు
తెలిసిన కథను పంపండి. కథ రెండు పేజీలకు మించకూడదు
కథలు బుక్‌పోస్టుద్వారా పంపవచ్చు. కాని, జూలై 15-వ తేదిలోపలనే
మాకు చేరేటట్టు పంపాలి. మీరు కథలుపంపే కవరుపైన
అడ్రెసు ఈవిధంగా వ్రాయండి. 'కథలతాతయ్య'

చందమామ ఆఫీసు :: పోస్టుబాక్సు 1686
మదరాసు - 1.


సంపుటి 7
సంచిక 1





జూలై
1950





# వీర బాలుడు

ఒక ఓడ కప్తాను కొక్క అబ్బాయి
ఎన్నడూ తండ్రి అనతిమీర డతడు
తండ్రికూడా అతని విడిచుండలేడు
తండ్రి వెనువెంటనే ఉండునత డెపుడు.

నట్టనడి సంద్రాన ఆ ఓడలోన
ఎందుకో నిప్పంటుకొన్న దొకసారి
ఓడ యాత్రికులంత హడలిపోయారు
కంగారుతో వణికి వెలవెలాబారి.

'ఏమి చేయటమంటు' యోచించుచుండ
ఓడ మరిఒకటి ఆ దారివచ్చింది
కప్తాను ముదముతో గంతులేశాడు
యాత్రికుల మనసులో ఆశ రెచ్చింది.

ఆ ఓడనాపి యాత్రికుల నందరిని
కప్తాను అందు ఎక్కించబోయాడు
తన కొడుకుతో 'నీవు చుక్కానిచూడు
నేను పిలచినదాక కదల'కన్నాడు.

కప్తాను యాత్రికుల ప్రాణరక్షణలో
తనకొడుకు సంగతే మరచిపోయాడు
పెద్దమంటలు ఓడచుట్టు ముట్టాయి
గుర్తొచ్చినా ఇంక ఏమిచేస్తాడు ?

రచన:
'బైరాగి'

అబ్బాయి అక్కడే తన తండ్రికొరకు
గుండె నిబ్బరముతో వేచిఉన్నాడు
తండ్రి తిరిగొస్తాడు తనను తోడ్కొని
తీసుకెళ్తాడనే కాచుకొన్నాడు.

కాని ఎంతకు తండ్రి తిరిగిరాలేదు
ఓడ చెక్కలుకూడ మండసాగాయి
ఐనప్పటికి తండ్రి తిరిగి రాలేదు
అబ్బాయిచుటు పెనుసెగలు రేగాయి.

పాదాలు మండాయి పెదవులెండాయి
పొగదగిలి కన్నీళ్ళు జాలువారాయి
'ఇంకెంత సేపు నేనిక్కడుండాలి?
నాన్నగార'ని పిలచినాడు అబ్బాయి.

కాని అక్కడ జవాబెవ్వరిస్తారు?
భుగభుగా పెనుమంట లెగసి చిమ్మాయి
ధగధగా కెంజాయ లొరసిక్రమ్మాయి
రాయిలా నిలిచాడు ఒంటి అబ్బాయి.

వాడివాడిన చేయి వెనుదీయలేదు
కందికందిన కాలు వెనుకేయలేదు
వీరబాలుడు అగ్ని కాహుతయ్యాడు
కాని తనతండ్రి యానతి మీరలేదు.







# రోకంటి పాటలు

[ సేకరణ: వడ్లమూడి గోపాలకృష్ణయ్య ]

ఏడేళ్ళు ఏడేళ్ళు పధ్నాలుగేళ్లు
ఎట్టా వుంటివి సీత నట్టడవిలోన
పిట్టలూ గూయంగ భీతేల లేదు!
పాములు గూయంగ భయమేల లేదు!
నా మరది లక్ష్మన్న లంక నేలంగా
భయమేల నాకింక ఓపడతులార!

* * *

ఆకు తోటల్లోవి పోకి దూలాలు
అవి మా కన్నారి ద్వారబంధాలు
ద్వారబంధం మీద యీగవాలింది
యీగను సూసి రాజు డేరా పన్నాడు.

* * *

కడిగిన కుండమీద కాకి వాలింది
కాకికి బెడ్డేస్తె కాముడికి తగిలె.

* * *

గుఱ్ఱమ్ము ఇడిబణ్ణం కూడు కెళ్ళాయె?
ఏమిరా బంటాడ! అన్నేలరాడు?
అన్నొచ్చె దారిలో మేడ యున్నాది
మేడమీద మేనమామ కూతురున్నాది
మేలమ్ములాడుతా మేడ ఓగనీదు
సరసమ్ములాడుతా సాగిరానీదు.

అర్ధ రేత్రికాడ నిద్ర పొద్దేళ
అక్కబోలు తలుపు మీటినా రెవరో
మనింటి కల్లుడు మన్నిసొదరి
ఒచ్చినా డేమోను ఓలమ్మి వినవే.

* * *

శ్రీకృష్ణరాయుడు ఎవ్వరల్లూడు
సిద్ధాంత మేలేటి సీత లల్లూడు
శ్రీరాము లల్లూడు సీత లల్లూడు
రావోయి పెద్దన్న రాజు లల్లూడ!

* * *

పిన్నమ్మ నావాడ యేమి పంపింది?
పింగాణి చిప్పల్లో గంధ మంపింది
నా అమ్మ నావాడ యేమి పంపింది?
నానుపు మడతల రవికె లంపింది.

* * *

గారాల తమ్ముడు కోటయ్య వస్తే
గారెలొండే అప్ప గంభీరు డన్ని
అబ్బురపు తమ్ముడు కోటయ్య వస్తే
అరిసెలొండే అప్ప అతి వేగిరాన.

* * *

అల్లుడా అల్లుడా బొల్లి జగ్గయ్య
నీకొండిన బూరెలు బూజట్టిపోయె
నీకొండిన అరిశెలు అడుగంటిపోయె.



# రెడ్డొచ్చె మొదలాడు



పూర్వం రెడ్డిసీమలో ఒక చిన్నగ్రామం ఉండెది. ఆ గ్రామంలో ఎక్కువగా రెడ్లు ఉండేవారు. రెడ్లలో లక్షాధికారి మొదలు భిక్షాధికారివరకూ కష్టపడి పనిచేయవలసిందేగాని, ఒక్కక్షణమైనా వృథా కాలక్షేపం చేయరు. వాళ్ళకు ప్రొద్దున్న మొదలు సాయంకాలంవరకూ పొలంపని చూడటం, పాలు పితుక్కోవటం, దూడలకు గ్రాసం సమకూర్చటం — వీటితోనే సరిపోతుంది. ఇంటికి చేరుకొనేసరికి రాత్రి ఎనిమిది గంటలు కూడా అవుతూ వుంటుంది. అప్పుడు స్నానం, భోజనం చేసుకొని రామాలయం దగ్గరకో, మునిసీబుగారి పెద్ద గచ్చరుగుమీదికో చేరుకుంటారు, నలుగురున్నూ.

అక్కడినించి వ్యవసాయపు భోగట్టాలు, ఊళ్ళో మంచిచెడ్డలు చర్చించి, ముచ్చటించుకొనేసరికి ఏ పదిన్నరా, పదకొండో అవుతుంది. ఇదంతా ఐన తరువాత ఎవళ్ళ యిళ్ళకు వాళ్ళుపోయి నిశ్చింతగా నిద్రపోతారు. మళ్ళీ కోడి కూసిందంటే లేచి పొలాల్లోకి పోవలసిందే. ఇలా ఐకమత్యంతో, అన్యోన్యంతో, అన్నాదమ్ములలాగా మెలగుతూ, ఆ గ్రామంలో రెడ్లు అందరూ ఒక్కత్రాటిపైన నడుస్తూ ఉండేవారు. పండగా పబ్బమూ వచ్చిందంటే హరికథలు, కాలక్షేపాలూ జరిపించి, ఊరిమొత్తంమీద చందాలు వేసుకొని విద్వాంసుల్ని సన్మానించేవారు.

ఇలాగే ఒకయేడు సంక్రాంతికి గ్రామపెద్దలు నరుగురూ కూడి 'ఈ సంపత్సరం వేడుకలూ వినోదాలూ ఏమి జరిపిద్దామా ?' అనుకొని, తోలుబొమ్మలాట ఏర్పాటు చేశారు. ఆనాటిరాత్రి ఏడుగంటలు మొదలుకొని రామకోవెలదగ్గర పందిరిలోకి వచ్చినజనం ఇసుకవేస్తేరాలకుండావుంది.



ఈ నెల బహుమతి పొందిన 'సామెత కథ'— సంపాదన: *వీరిశెట్టి సుబ్బారావు, వుల్లేటికుర్రు

*వీరికి ఆగస్టు '50 నుండి ఒక సంవత్సరం వరకు 'చందమామ' ఉచితంగా పంపబడుతుంది



ఎనిమిది, తొమ్మిది గంటలకల్లా పిన్నా, పెద్దా ఇంచుమించు ఊరందరూ వచ్చేశా రన్నమాటే.

అదుగో యిదుగో అంటూ తీరా ఆట మొదలెట్టేసరికి పదికొట్టింది. ఎలాఐతేం, తెరమీదకు బంగారక్క, జుట్టుపోలిగాడూ ఎక్కారు. వాళ్ళ సంభాషణలు వింటూ వుంటే జనానికి పొట్ట చెక్కలయేట్టు నవ్వొచ్చింది. మీసాలు మెలితిప్పుతూ కూర్చొనివున్న రెడ్డిపెద్దలు కూడా చాలా ఆనందించి, "అయితే ఇక కథ లోకి దిగుదాం" అన్నారు. బొమ్మల విద్వాంసుడు సరేనంటూ, భారతంలో నించి శశిరేఖా పరిణయం కథ జరగబోతుంది అనిచెప్పి, రాగాలాపన మొదలెట్టేడు.

తీరా కథ ప్రారంభించేసరికి రత్నాల రామిరెడ్డిగారు చక్కా వచ్చారు. రామిరెడ్డి గారంటే సామాన్యులా యేం? గ్రామం అంతా ఆయన డబ్బుమీద బ్రతుకుతున్న దాయె. ఆయన అప్పిస్తేనే పొయ్యిలో పిల్లి కదులుతుంది, నూటికి తొంభైమందికి.

రామిరెడ్డిగారు వస్తూనే, "కొద్దిగా లావా దేవీలు ఉండటంచేత ఆలస్యం అయింది" అంటూ సభలో ప్రవేశించారు.

"ఆఁ- దానికేంలెండి. రండి రండి రామిరెడ్డిగారూ!" అంటూ, ఆయన్ని ఆహ్వానించి తీసుకవెళ్ళి ముందువరసలో కూర్చొబెట్టారు.

"అందరూ వచ్చేసినట్టే, ఇంక కానీయండి" అని సభపెద్ద చెప్పేసరికి, బొమ్మల విద్వాంసుడు మళ్లీ విఘ్నేశ్వర పూజ చేసి బంగారక్కనూ జుట్టుపోలి గాణ్ణీ తెరమీదికి ఎక్కించాడు.

విద్వాంసుడు రాగాలాపనచేసి, మళ్లీ కథ ప్రారంభించేటంతలో వైద్యుల వెంకట రెడ్డిగారు, చక్కా వచ్చారు. గ్రామం మొత్తంమీద ఏవళ్లు కాస్తంత జిర్రుమన్నా



వెంకటరెడ్డిగారి చెయ్యి తగిలితేకాని బతుకే లేదు. అటువంటప్పుడు ఆయనకు ప్రత్యేకించి తగిన మర్యాద జరక్కపోయిందంటే మరేమన్నావుందా, కొంప మునిగిపోతుంది గాని? "ఊళ్ళో కేసులు చూచుకు వచ్చేటప్పటికి ఈవేళయింది. ఎంత పెందరాళే తెములుదామనుకున్నా, తీరిక దొరకటమే కష్టమైపోతున్నది. ఎవళ్ళను కాదనటం!" అని ఆయన అనటం పూర్తిచేయకుండానే "ఆఁ- దానికేంలెండి. దయచేయండి డాక్టరుగారూ!" అంటూ ఆయన్ని గౌరవించి తీసుకపోయి, ముందు వరసలో కూర్చోపెట్టారు.

"ఇక, రావలసినవారెవరూ కనపడరు, కానీయండి" అని చెప్పేసరికి, మళ్లీ గణపతిపూజ జరిగింది. బంగారక్క, జుట్టుపోలిగాడి బొమ్మలు తెరమీదికి ఎక్కాయి. అందరూ విరగబడి నవ్వారు. విద్వాంసుడు మళ్లీ ఒకసారి రాగాలాపన చేసి, సరాసరి శశిరేఖా పరిణయం కథ ఎత్తుకున్నాడు.

ఇంతలో పులమర పుల్లారెడ్డిగారు బయల్దేరి వస్తున్నట్టు సభ్యులలో గుసగుసలు బయలుదేరినై.




పుల్లారెడ్డిగారంటే గ్రామానికంతటికీ భీష్మునిలాంటివారు. నూటపాతికేళ్ళు నిండిన వయోవృద్ధు, జ్ఞానవృద్ధూనూ. ఆయనమాటంటే ఆబాలగోపాలమూ భక్తితో శిరసావహిస్తారు. అందుచేత కొంతమంది పెద్దలు ఎదురువెళ్ళి ఆయనను తోడ్కొని వచ్చారు. సభలో "అదుగో, వస్తున్నారు. రెడ్డిగారు, పుల్లారెడ్డిగారు..." అని కోలాహలం బయల్దేరింది.

ఆయన ఆలస్యమైనందుకు నొచ్చుకుంటూ, "అయ్యో ఆట మొదలెట్టారు కాబోలునే. ఎంతవరకూ అయిందేమిటి?" అన్నారు.



"అబ్బే, మరేం ఫరవాలేదులెండి. ఎంతవరకు అయితేనేమిటి?" అని సద్ది చెబుతూ, వృద్ధుడైన పుల్లారెడ్డిగారిని గౌరవంచేసి తీసుకవెళ్ళి ముందువరసలో కూర్చోబెట్టారు.

మళ్ళీ సభపెద్ద "రావలసినవారందరూ వచ్చేసినట్టే. ఇంక ఈసారి మొదలెట్ట వచ్చు" అన్నాడు.

బొమ్మల విద్వాంసుడు మళ్లీ ఒకసారి పూజచేసి, బంగారక్క జుట్టుపోలిగాడి బొమ్మలు తెరమీదికి ఎక్కించాడు. మళ్లీ రాగాలాపన చేసి, శశిరేఖా పరిణయం కథ ఈసారి జోరుగా ప్రారంభించాడు.

కాని చిత్రమేమంటే, విద్వాంసుడు కథ ప్రారంభించేసరికల్లా మళ్లీ ఒక రెడ్డిగారు రావటం, వారిని ఉచిత మర్యాదలతో సత్కరించి ముందు వరుసలో కూర్చోబెడుతూ వుండటం, ఇలా మరి కొంతసేపు కలాపం జరుగుతూవచ్చింది.

అప్పటికి వేగుజుక్క పొడిచింది, తొలి కోడి కూసింది. వేళ అయిందంటూ రెడ్లు అందరూ లేచి, ఎవరిమానాన వారు పొలం పనికని వెళ్ళిపోయారు. బొమ్మలాట కథ కథగానే నిలిచిపోయింది. నిలిచిపోక మరేం జరుగుతుందీ? కాస్తో కూస్తో కథ జరిగేటప్పటికల్లా ఏ రెడ్డిగారో చక్కా రావటం "అదుగో, రెడ్డిగారు వచ్చారు, మళ్లీ మొదలెట్టండి" అనటం, అలా చుక్క పొడిచేవరకూ ఒక్కొక్కరే వస్తూ వుండి ఎప్పటికప్పుడు కథ మళ్లీ కొత్తగా ప్రారంభించేసరికి తెల్లవారిపోయి, ఎవరి పనులకు వారు పోవలసివచ్చింది.

అప్పటినించీ, ఎవరైనా ఒకపని ప్రారంభించి, మధ్యలో ఆపివేసి, మళ్ళీ మొదలు పెడుతూవుంటే 'రెడ్డొచ్చె మొదలాడరా' అని అనటం పరిపాటిఐంది. ఈమాటే తెనుగునాట సామెతగా పరిణమించి, శాశ్వతంగా నిలిచిపోయింది.






కొన్నివేల సంవత్సరాలక్రిందటట, శ్రావస్తి నగరాన్ని దానశీలుడనే రాజు పరిపాలిస్తుండేవాడు. ఆ చుట్టుప్రక్కల రాజులందరిలోకీ దానశీలుడే గొప్ప. ఏమంటే, లక్షలకొలది సైన్యం వుంది. దాసదాసీజనాలకు లెక్కలేదు. ఇక ఆరాజు ధనాగారం రత్నాలు, మొహరీలు, వజ్రాలు వైడూర్యాలు మొదలయిన అన్నిరకాల వెలలేని మణులతోనూ వెండి, బంగారు ధనరాసులతోనూ నిండివుండేది. అన్నిటినీ మించిన అదృష్టం అనుకూలవతి, అపురూపసౌందర్యరాశి ఐన 'కాంతిరేఖ' రాజుకి రాణీ కావటమే. మరో గొప్ప విషయం ఏమిటీ అంటే ఇంత ఐశ్వర్యంతో తులతూగుతున్నా ఆ రాజుకి ఏకోశానా గర్వం అనేది లేదు. బీదసాదలంటే రాజుకి ఎంతో దయ. దైవభక్తికూడా అపారం. ఇక ఆయన చేసే దాన ధర్మాలకు అంతే లేదు. 'దేహి' అని వచ్చినవాడికి 'లేదు' అనకుండా ఏదో ఒకటి ఇచ్చి పంపేవాడు. ఆ కారణంచేతనే రాజు 'దానశీలుడు' అనే తన పేరు సార్థకపరుచుకున్నాడు.

ఇలా వుండగా కొన్నాళ్ళకు ఒక పెద్ద అవాంతరం వచ్చింది. ఎంతో ఆరోగ్యంగా తిని తిరుగుతున్న రాణీ కాంతిరేఖ వున్నట్టుండి హఠాత్తుగా చనిపోయింది. రాజు కంటికిమింటికి ఏకధారగా ఏడ్చాడు. ప్రజల దుఃఖానికి అంతేలేదు. కాని ఎంత ఏడ్చి, చనిపోయిన రాణీని తిరిగి బ్రతికించటం ఎవరివల్ల అవుతుంది?

క్రమంగా రోజులు గడుస్తున్నకొద్దీ రాజూ, ప్రజలూకూడా చనిపోయిన రాణీని




గురించి తలచటం మానివేశారు. ఇప్పుడు అందరికీ ఒకే ఒక దిగులు పట్టుకుంది. రాణీ కడుపున సంతానం కలగక ముందే చనిపోయింది. తమ రాజు తదనంతరం, రాజ్యం పరులపాలు కాకుండా వుండటానికి రాజు తిరిగి వివాహం చేసుకుని సంతానం పొందటం అవసరం. మంత్రులూ, సామంతులూ రాజుని తిరిగి వివాహం చేసుకోమన్నారు. రాజు ఒప్పుకోక తప్పిందికాదు. ఒక సుముహూర్తాన రాజు తిరిగి వివాహం చేసుకున్నాడు. కాని, దురదృష్టమేమోకాని రెండవ భార్యకూడా కొద్దిరోజులకే ఆకస్మికంగా చనిపోయింది.

ఈ వార్త ఆరాజ్యంలో ప్రజలందరి నోటాపడి క్రమంగా చుట్టుప్రక్కల రాజ్యాలకికూడా పాకిపోయింది. మంత్రులూ, సామంతులూ ఈసారికూడా రాజుని తిరిగి మూడోవివాహం చేసుకోమని వేడుకుని ఎలాగైతేనేం రాజుచేత ఒప్పించగలిగారు. కాని రాజుకి భార్య అయిన ఇల్లాలు పెళ్ళి అయిన కొద్దిరోజులకెల్లా చనిపోతూన్నదన్న వార్త విన్నతర్వాత ఏ తండ్రి చూస్తూ చూస్తూ తన బిడ్డని మృత్యుముఖంలోకి పంపటానికి ఒప్పుకోగలడు? రాజవంశీయులుకాదు కదా, కడకు సామాన్య సంసారులు సైతం తమ పిల్లని రాజుకి యివ్వటానికి ఒప్పుకోలేదు. అయినా పట్టు విడవకుండా మంత్రులూ, సామంతులూ దేశం నలుమూలలా యింకా వెతుకుతూనే వున్నారు.

అలా వెతకగా వెతకగా కొన్నాళ్ళకు తన కుమార్తెను యివ్వటానికి ఒక పేదరాలు ఒప్పుకొన్నది. ఆ పిల్ల బీద వంశంలో పుట్టినప్పటికీ, అందచందాలలో ఏ రాకుమార్తెకూ తీసిపోలేదు. అతిరూపసౌందర్యరాశి అయిన ఆ పిల్లని చూచి మంత్రులూ, సామంతులూ ఉప్పొంగిపోయారు. వెంటనే

ఈ వార్త రాజుకి అందజేశారు. ఒక సామాన్య స్త్రీ ఈసారి తనకు రాణీ కాబోతుందని తెలిసినప్పుడు రాజు విచారించలేదు సరికదా ఎంతో సంతోషించి మంత్రులతో: "మృత్యుదేవతకి బీదలైనా ఒకటే, భాగ్యవంతులైనా ఒకటే. ఇంత ఐశ్వర్యంతో తులతూగుతున్న నా రాణు లను రక్షించ కోగలిగానా? బ్రతికే యోగం వుంటే ఎవరైనా బ్రతుకుతారు. కనుక మీరు చూచి వచ్చిన ఆ స్త్రీని చేసుకోవటానికి నాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు" అన్నాడు రాజు.

ఇది విన్న మంత్రులు ఉత్సాహ భరితులైనారు. మరి కొద్దిరోజులకల్లా మంచి ముహూర్తాన రాజుకీ ఆ పేదరాలి కూతురుకీ వివాహం ఏర్పాటుచేశారు.

వివాహం సలక్షణంగా జరిగే వరకూ ఎవరికీ గుండె ధైర్యంలేదు. ఎందు వల్లనంటే అంతకుముందు రాజు వివాహం చేసుకున్న రాణీలు కూడా వివాహం అయిన తర్వాత ఒక వారం తిరక్కుండానే చనిపోయారు.

కాని ఈసారి అలా జరగలేదు. క్రమంగా రోజులు, నెలలు ఏ అవాంతరమూ లేకుండా





గడిచిపోయినై. అప్పటికి రాజుకీ, మంత్రులకీ, ప్రజలకీ కొంత ధైర్యం చిక్కింది.

నాటినించీ ప్రజలు— "ఈ నాల్గవ భార్యవల్లనైనా మా రాజుకి సంతానం ప్రసాదించు తండ్రీ" అని దేవుడిని ప్రార్థించసాగారు. వారి ప్రార్థన దేవుడు విన్నాడుకాబోలు, మరో నెలకల్లా రాణీగర్భవతి అయినట్టు వార్త పొక్కింది. ఈ వార్త విన్న ప్రజల సంతోషానికి మేరలేక పోయింది. ఇక రాజు, అతని పరివారం సంగతి చెప్పేదేమిటి?

క్రమంగా నవమాసాలూ నిండి, మంచి నక్షత్రాన రాణీ పద్మముఖి సుఖప్రసవమై ముగ్గురు కవలల్ని కన్నది. కాని తమ వంశోద్ధారకుడుగా ఒక పుత్రుడు పుడతాడని ఎంతగానో ఆశతో ఎదురు చూస్తున్న రాజు, పుట్టిన ఆ ముగ్గురు కవలలూ ఆడపిల్లలే అని విన్నప్పుడు, కొంత నిస్పృహ చెందకపోలేదు. అయినా, రాజు తన నిస్పృహ పైకి ఏమాత్రం కనబరచలేదు. 'నాకు ఆడపిల్లలైనా మగపిల్లలైనా వీళ్లే" అనుకొని మనస్సు సమాధానపరచుకున్నాడు. ఏమైతేనేం ఆ ముగ్గురు కవలల్నీ రాజూ, రాణీ ఎంతో అల్లారు ముద్దుగా పెంచుకుంటున్నారు.

ముగ్గురు పిల్లలకూ తలిదండ్రులు వరసగా సుహాసిని, సుభాషిణీ, సుకేశిని అని నామకరణం చేశారు. క్రమంగా ముగ్గుకు పిల్లలూ, ఆ ఏటికా ఏడు పైబడినకొద్దీ, చక్కటి అందాల భరిణలుగా తయారవుతున్నారు. ఆ పిల్లల చక్కదనాన్ని చూచినవాళ్ళు "ఒక్కొక కుమార్తె పదిమంది కొమాళ్ళ పెట్టు" అని మెచ్చుకొనేవారు.

ఇంతటి ఆనందంలోనూ మధ్య మధ్య ఒక చిన్న అవాంతరం వచ్చి రాజునీ, రాణీనీ కంగారుపరుస్తుండేది. ముగ్గురు

పిల్లలలోనూ ఎప్పుడూ ఎవరో ఒకరు ఏదో ఒక అపాయంలో చిక్కుకోవటం మళ్ళీ ఎలాగో తప్పుకోవటం జరుగుతూ ఉండేది.

ఒకసారి సుహాసిని, తండ్రితో తోటలో షికారు చేస్తుండగా ఒక పెద్ద సర్పం ఆ పిల్లని కాటువెయ్యటానికి వచ్చింది. సమయానికి రాజు తన కత్తితో ఆ సర్పాన్ని నరికివేశాడే గాని లేకపోతే ఆ నాటితో సుహాసినికీ లోకానికీ ఋణం తీరిపోయేదే.

మరొకసారి సుభాషిణి తల్లితో నది ఒడ్డుకి షికారుకు వెళ్ళింది. అంతవరకూ ప్రశాంతంగా వున్న నది ఒక్కసారిగా పొంగి, ఒడ్డున నిలుచున్న సుభాషిణిని లోపలికి ఈడ్చుకుపోయింది. దైవానుగ్రహంవల్ల సరీగా ఆ సమయానికి ఒక పల్లెకారి ఆచోటికి రావటం, రాణీ కంగారు పడుతూవుండటచూచి, వాడు నదిలోదూకి ఎలాగైతేనేం సుభాషిణిని ప్రాణాలతో బైటికి తెచ్చి బ్రతికించటం జరిగింది. ఆ పల్లెకారే అటు రాకపోతే నాటితో సుభాషిణి నదీగర్భంలో కలిసిపోయివుండును.

ఇదేవిధంగా మరొకసారి మూడవ పిల్ల సుకేశిని ఒక గండం గడిచి బైట పడింది.







అది యేమిటీ అంటే—ఒకరోజున సుభాషిణీ, సుహాసినీ, సుకేశినీ కలిసి తోటలో పూలు కోయటానికి వెళ్ళారు. ముగ్గురూ మూడు బుట్టల్లో పూలు కోసుకుని తిరిగి మేడకు బయులుదేరారు. ముందు సుభాషిణీ, ఆ పిల్లవెనక సుహాసినీ, ఆవెనక సుకేశినీ నడుస్తున్నారు. ఇంతలో ఉన్నట్టుండి సుకేశిని కెవ్వున కేకపెట్టి పడిపోయింది. మిగతా పిల్లలిద్దరూ హడిలిపోయి, తల్లిదగ్గరకు పరుగెత్తి జరిగిన సంగతి చెప్పారు. తల్లి, వాళ్ళని వెంటబెట్టుకుని సుకేశిని పడివున్న చోటికి వచ్చిచూడగా, ప్రక్కనే పూలబుట్ట, ఆ పూలలో పాకుతూవున్న ఒక మండ్రగబ్బ కనిపించినై. అప్పటికి తెలిసింది రాణికి మండ్రగబ్బ కుట్టటంవల్లనే సుకేశిని అలా పడివుంటుందని. దానినిచంపి ఆమెవెంటనే పిల్లని ఎత్తుకుని మేడకు తిరిగి వచ్చింది. ఆస్థాన వైద్యుడికి కబురంపగా, ఆయన వచ్చి ఏదోమందు వేశాడు. కొంత సేపటికి తిరిగి సుకేశిని లేచి మాటాడసాగింది.

ఇలా, లేక లేక తమకు కలిగిన ఈ ముగ్గురు పిల్లలలో ఎప్పుడూ ఎవరికో ఒకరికి ఏదో ఒక గండం రావటం చూచేసరికి రాజు మనస్సు పరి పరి విధాల పోయింది. ఆయన తహతహలాడిపోయాడు. ఉండబట్టలేక ఒక రోజున జ్యోతిష్కుణ్ణి పిలిపించి, తన కుమార్తెలు ముగ్గురి జాతకాలు చూపించాడు.

జ్యోతిష్కుడు చాలాసేపు దీర్ఘంగా ఆలోచించి తర్వాత ఏమీచెప్పకుండా పూరుకొనేసరికి రాజు అరాటం మరింత హెచ్చింది. "ఏదో అనుమానిస్తున్నట్టున్నారే? ఉన్నదున్నట్లు చెప్పండి! నిజం వెల్లడిస్తారనే, వుద్దేశంతోనే మిమ్మల్ని రప్పించాను." అంటూ ఆప్యాయతమాపి అన్నాడు జ్యోతిష్కుడి భుజం తట్టుతూ.



అప్పుడు జ్యోతిష్కుడు యిలా చెప్పాడు: "ఈ పిల్లలు చాల అంద చందాలతో వెలిగిపోతూ వుంటారు. ఆనాటి కానాటికీ వారి అందం వృద్ధిపొందుతుందేగాని తీసిపోదు. కాని విచారించవలసిన విషయం ఏమిటీ అంటే, వీరి ఈ అపురూప సౌందర్యమే వీరికి శత్రువవుతున్నది. వీరు పుట్టిన దగ్గిర్నుంచీ ఎప్పుడూ ఏదో ఒక గండం దాటవలసి వస్తూనే ఉండాలే..." అని ఆగాడు.

జ్యోతిష్కుడి నోటవెంట వచ్చిన ప్రతి ఒక్క మాటకి రాజు గుండె తరుక్కు పోతోంది. ఆయన కంటివెంట ఏకధారగా కన్నీరు కారటం చూచి జ్యోతిష్కుడు మధ్యలో ఆగాడు. కాని రాజు, ఎంత కష్టానికైనా ఓర్చుకుని జాతకంలోని నిజా నిజాలు తెలపవలసిందని పట్టుబట్టాడు. అందుకని—"ఆగారేం? చెప్పండి" అని జ్యోతిష్కుణ్ణి హెచ్చరించాడు.

"నిజంచెప్పి మీ మనస్సు కష్టపెట్ట వలసి వచ్చిందే అని విచారిస్తున్నాను" అన్నాడు జ్యోతిష్కుడు.

"ఫరవాలేదు, చెప్పండి. నా చిట్టి తల్లుల్ని నా కాయశక్తులా రక్షించుకోవ టానికి ప్రయత్నిస్తాను. మీరు మాత్రం ఉన్న సంగతి దాపరికం లేకుండా చెప్పండి" అని దైన్యావస్థలో అడిగాడు రాజు.

అప్పుడు జ్యోతిష్కుడు తిరిగి యిలా చెప్పసాగాడు—

"మన అమ్మాయిలకు ఏడేళ్ళు నిండే వరకూ 'దినదిన గండం నూరేళ్లాయుస్సు' అన్నట్టుగానే వుంటుంది. కాని, ఈ ఏడేళ్ళూ, గండాలన్నీ గడిచి బైటపడ్డా రంటే యిక మన అమ్మాయిలకు ఎటువంటి భయమూ లేదు. కనుక ఏడేళ్లు నిండేవరకూ పిల్లలమీ

కంటికి రెప్పలా కాపాడుకోగలిగితే మనం ధన్యులమే. ఇంతకు మించి జాతకంలో చెప్పదగ్గ విశేషం లేదు" అని ముగించాడు జ్యోతిష్కుడు.

రాజు, జ్యోతిష్కుని అనేకవిధాల సత్కరించి పంపివేశాడు. తర్వాత రాణీ దగ్గరకు వచ్చి, జ్యోతిష్కుడు చెప్పిన విషయాలన్నీ చెప్పలేక చెప్పలేక ఎలాగో మనసు విడిచి చెప్పాడు. వింటూవింటూ రాణీ స్పృహతప్పి పడిపోయింది.

దాసదాసీలు ఉపచారం చెయ్యగా కొంత సేపటికి రాణీకి స్పృహ వచ్చింది. రాజు ఆమెని ఓదారుస్తూవుండగా, పిల్లల్ని కాపాడుతున్న దాది పరుగెత్తుకుంటూవచ్చి "మన అమ్మాయిలు ముగ్గురూ స్పృహ తప్పి పడిపోయారమ్మా తోటలో" అంటూ గొల్లున ఏడ్చింది. కంగారుపడుతూనే రాణీ తోటవైపుకి పరుగెత్తింది. దాది ఆమె వెంట పడింది. ఆస్థానవైద్యుడికి కబురుపంపారు. రాజుకూడా తోటవైపుకి పరుగెత్తాడు.

---

[ఆ ముగ్గురు పిల్లలూ అలా స్పృహతప్పి పడిపోవటానికి కారణం ఏమిటో, అతర్వాత ఏమిజరిగిందో వచ్చేనెల 'చందమామ'లో చదవండి]





# గర్వించిన సింహం

పూర్వకాలమందు ఒకానొక కీకారణ్యంలో ఒక సింహం వుండేది. అది ఆడవులను పాలించే మృగరాజు కావటంచేత, క్రూర జంతువులూ సాధు జంతువులు కూడా దానిపట్ల భయభక్తులతో సంచరించేవి.

అవి ఎంత భయభక్తులతో మసులుకొంటున్నప్పటికీ, మృగరాజుకు అంతకంతకు గర్వమూ, అహంకారమూ బలిసిపోయి, కన్నూ మిన్నూ కానకుండా ఎప్పుడేమి తోస్తే అపని చేయనారంభించింది. అది, అలా ఏమిచేసినా నోరు మూసుకుని ఊరుకోవటమే కాని, 'మృగరాజా! నీవు తప్పుదారిని నడుస్తున్నావుసుమా!' అని సాహసించి ఏ జంతువూ చెప్పలేక పోయేది.

ఒకనాటి రాత్రి కటికచీకటిలో, ఆ సింహం భూమిదద్దరిల్లేట్టు భయంకరమైన ధ్వని చేసుకొంటూ అహారంకోసం బయల్దేరింది. ఆ ధ్వని చెవినిపడగానే నిద్రలోవున్న జంతువులన్నీ హడిలిపోయి, కంగారుగా పరుగులెత్తినై. చెట్లపైనుండే పక్షులుకూడా ఎగిరిపోయినై. గాలికి ఊగిసలాడే గడ్డిపరకపైన పడుకొనివున్న చిన్నారి ఈగమ్మకుకూడా మెలకువ వచ్చేసింది. చిన్నారి ఈగమ్మ తన చిన్ని కాళ్ళతో చిన్నారి కన్నులు నులుము కొంటూ బద్ధకంతో 'ఏమిటబ్బా ఈ సందడీ!...' అన్నది.

ఈమాట సింహం చెవులకి వినపడిన వెంటనే 'ఇంత నిర్లక్ష్యంగా మాటాడుతున్న ఆ పొగరుమోతు ఎవరు?' అనుకొంటూ ఆవేశంతో ఆ మాట అన్నవాళ్ళను శిక్షించాలని వెతుక్కొంటూ ఉరుకులు వేయజొచ్చింది.

మృగరాజు వెళ్లి వెళ్లి చిన్నారి ఈగమ్మ పడుకొనివున్న గడ్డిమొక్క పక్కనించే పోయేసరికి, అది 'అగు, అగు. నీ వెవరవు?

కె. వి. జె. పట్నాయక్ - విశాఖపట్నం



ఇలా పిచ్చెత్తినట్టు అరుస్తూ, అందరి నిద్ర ఎందుకు పాడుచేస్తున్నావు? నిద్ర పాడుచేస్తే ఊరుకుంటా ననుకొన్నావా? జవాబు చెప్పి మరీ కదులు' అంటూ, అటకాయించింది.

ఈ మాటలకు శివమెత్తిపోయి, "నా అంతటి వాడిని ఎవరంటావా? ఎదురు ప్రశ్నలు వేస్తావా? నువ్వెంత, నీ బతుకెంత? మృగరాజుగారు శంఖారావం చేసుకొంటూ ఆహారంకోసం బయల్దేరారని తెలియదా? ఎవరితో మాటాడుతున్నావో ఒళ్ళుతెలిసి మసులుకో" అని హెచ్చరించింది, గర్వించిన సింహం.

"రాజువైతే కోటలో కూర్చోవాలెగాని, అర్ధరాత్రివేళ అందరనూ నిద్రలేపితే ఊరుకుంటారనుకున్నావా? రాజే కాదు, బంటే కాదు, ఎవళ్ళ హద్దుల్లో వాళ్ళు ఉంటేనే మర్యాదా దక్కుతుంది. లేకపోతే లేదు...." అన్నది నిర్భయంగా చిన్నారి ఈగమ్మ.

"ఓసి భడవా! నలుసంత ఉన్నావో లేవో, నాకు నీతులు చెప్పవస్తావా? రాజంటే ఏమిటనుకున్నావు? ఇష్టం వచ్చినపని చేయవచ్చు. ఇష్టమొచ్చినట్టు తిరగవచ్చు. ఇష్టంవచ్చిన జంతువునల్లా తినేయవచ్చు. రాజుకి హద్దులేమిటి?" అని హుంకరించింది సింహం.

చిన్నారి ఈగమ్మ ఎగతాళిగా నవ్వుతూ "నువ్వు రాజువని నీతో ఎవరు చెప్పారు? నీకు అందరూ భయపడుతున్నారని అనుకొంటున్నావు కాబోలు, నీవంటే ఎవ్వరికీ భయంలేదు. నాకు అసలే భయం లేదు. నీవే రాజువైతే నాతో యుద్ధంచేసి నన్ను జయించు, చూదాం" అని సింహానికి సవాలు చేసింది.

రోషంకొద్దీ సింహం దవడలు తెరిచి పెద్దగా నిట్టూర్చింది. ఆ గాలికి గడ్డిపరక

కదిలిందికాని, దానిపైన పడుకున్న చిన్నారి ఈగమ్మ చలించనేలేదు. "ఓయి సింహమా!—రా, యుద్ధానికి రా. నీ జూలు కాస్తా ఎగరకొడతాను, తీరిపోతుంది. రాకపోయావో, ''సింహం నన్నుచూసి భయపడిపోయింది' అని అరణ్యంలో జంతువు లన్నింటికీ చాటిస్తాను. అప్పుడు అవన్నీ కలిసి నన్నే రాజుగా చేసు కొంటాయి" అని బెదరించింది.

"వెధవ ఈగలు! ఇలాంటివి వెయ్యి ఈగల్ని ఒక్కసారి మింగేస్తాను" అనుకుంటూ సింహం పంజా దువ్వి ఈగమీదకు ఎగరబోయింది. తీరా సింహం గడ్డిపరకపైన పడుకొనివున్న చిన్నారి ఈగమ్మను కొట్టబోయేసరికి, అది సింహం ముక్కులోదూరి తన విషపుతొండంతో పొడిచి చెడామడా కుట్టనారంభించింది.

బడాయిలు కొట్టిన ఇంతటి పౌరుషమైన సింహం దానిబాధకు తట్టుకోలేక కుయ్యో మొర్రో మంది. తుమ్మింది. తిమ్మింది. చిర్రుమంది, బుస్సు మంది. తోక ఆడించింది. గర్జించింది. గోండ్రు పెట్టింది. చివరకు ఏడిచిమొత్తుకుని బుర్ర నేలమ వేసి కొట్టుకుంది.




చేసేదిలేక ఆ సింహం 'ఈగమ్మా! ఈగమ్మా! నువ్వే రాజువి! నువ్వే రాజువి! నేను కాదు, నువ్వే రాజువి. ఇవతలికి రా!!' అంటూ గోలపెట్టింది.

కొంతసేపటికి చిన్నారి ఈగమ్మ నవ్వు కొంటూ ఇవతలకు వచ్చి "ఓయి సింహం!—నీకు బుద్ధిచెప్పటానికి అన్నానే కాని, నీ రాజుపదవి ఎవడిక్కావాలి? పోపో!" అంటూ, మళ్లీ హాయిగా తన గడ్డిపరకమీద పవ్వళించింది. నాటినించీ గర్వం అణగిన ఆ సింహం ఏ జంతువు నైనా చంపుతుందిగాని, ఈగపేరు చెబితే మాత్రం హడిలిపోతుంది.



# అపకారికి ఉపకారము

అనగనగా మధువ్రజం అనే పట్టణాన్ని విరూపాక్షుడనే రాజు పాలించుతూ వుండేవాడు. ఒకనాడు రాజభటు లిద్దరు ఒక మనిషిని రెక్కలుకట్టి శ్మశానానికి లాక్కొచ్చి కఱకు కత్తులతో వాణ్ణి ముక్కముక్కలుగా నరికిపడేసి వారిదారిని వారు వెళ్లిపోయారు. ఆ మాంసపు ముక్కలు తిందామని ఆశపడి అక్కడికి ఒక కుక్క తన పిల్లలతో సహా వచ్చింది. ఆకలిచేత కడుపులు నకనకలాడుతున్నాయేమో, ఆ కుక్కా, పిల్లలూ ఆత్రంతో తలొక మాంసంముక్కనీ నోట కరుచుకున్నాయి. కాని తల్లికుక్క మరుక్షణంలోనే నోట కరుచుకున్న మాంసపు కండను ఉమ్మేయటమే గాక, పిల్లలచేత కూడా ఉమ్మేయించింది. ఇదేమిటా అని కుక్కపిల్లలు ఆశ్చర్యపడేసరికి,—

'ఇది కృతఘ్నుడి మాంసం. కృతఘ్నుడనగా రక్షించినవాణ్ణి భక్షించే దుర్మార్గుడన్నమాట. కృతఘ్నుని మాంసం కుక్కలు కూడా ముట్టుకోవని పెద్దలన్నారు...'

అని తల్లికుక్క చెప్పింది. ఆ సమయానికి అక్కడికి మాంసఖండాలకోసం రాంబందొకటి వచ్చి వాలింది. నరికిఉన్న ఆ తలా మొహం చూసి ఆ రాంబందు "ఓహో, ఈ కృతఘ్నుడా? ఎవడో అనుకున్నాను" అంటూ చీదరించుకుని, ఎగిరిపోబోయింది. అప్పుడు తల్లికుక్క దానిని

"ఈ కృతఘ్నుణ్ణి నీవూ ఎరుగుదువా?" అని అడిగింది.

"ఎరక్కపోవడమేమిటి? మా పక్షులలోకల్లా మేటి ఐన నాడీజంఘుణ్ణి చంపినది ఈ నీచుడే" అంది రాబందు.

ఆ మాట విన్న తల్లికుక్క "అయ్యో! నాడీజంఘుడు చనిపోయాడా? ఈ దుర్మార్గుడే చంపేశాడా?" అంటూ విచారించటం మొదలెట్టింది.

పి. వి. రామచంద్రమూర్తి—మద్రాసు



అప్పుడు రాంబందు, "ఔను. నేను కూడా ఆ మఱ్ఱిచెట్టుమీదే ఉంటున్నాను. నాలుగు రోజుల క్రితం ఈ పాపాత్ముడు ప్రొద్దున్నే వచ్చి ఆ చెట్టుక్రింద కూచుని ఏడవటం మొదలెట్టేడు. పాపం జాలిగుండె గల నాడీజంఘుడు గబగబా కిందికి వాలి, 'ఏమయ్యా, ఎవరు నువ్వు? ఎందు కిలా విచారిస్తున్నావు? నీకు వచ్చిన కష్టం ఏమిటి?' అని అడిగేడు. అప్పుడు వీడు 'నేనొక పేదబ్రాహ్మణ్ణి—' అని ప్రారంభించాడు.

'బ్రాహ్మడు' అనటంతోనే కుక్క ముక్కుమీద ముందరికాలు పెట్టుకుని, "ఏమిటి? బ్రాహ్మడా? బ్రాహ్మడికే ఇలాంటి పోయేకాల మెందుకొచ్చింది?" అని అడిగింది.

ఈ ప్రశ్నకి రాంబందు, "వీడు పుట్టుకచేత బ్రాహ్మడే ఐనా, కులభ్రష్టయిపోయాడట. ఒక బోయదాన్ని కట్టుకుని వాళ్లలో కలిసిపోయి, మాంసం తినటం కల్లు తాగటం మొదలెట్టేడట. కొన్నాళ్లయిన తర్వాత వీణ్ణి పెళ్లాం, 'నిన్ను ఎంతకాలం మేపటం? ఎక్కడికైనా వెళ్లి డబ్బు సంపాదించుకురా' అంటూ తరిమేసిందట. డబ్బు సంపాదిద్దామని బయల్దేరి, దారిలో ఎన్నో కష్టాలు పడి, ఆఖరికి మా మఱ్ఱి కిందకు చేరుకున్నాడు. మా నాడీజంఘుడు వీడి దరిద్రం స్థితి గమనించి 'అయ్యా, మధువ్రజపురాన్ని యేలుతూవున్న విరూపాక్షమహారాజు నాకు ప్రాణస్నేహితుడు. ఆయనదగ్గరకువెళ్లి నిన్ను నేను పంపించానని చెప్పు. ఆయన నీ దరిద్రం పోగొడతాడు' అని చెప్పి పంపేడు."

"అప్పుడేమి జరిగిం?" దని ఆత్రంతో ప్రశ్నించింది కుక్క.

"ఆప్రకారం వెళ్ళగా, ఆ బ్రాహ్మణ్ణి మహారాజు అనేకవిధాల గౌరవించి సత్క



రించాడు. వీడు రాజువద్దనుంచి మొయ్యగలిగినంత సొమ్ము మూటగట్టి తెచ్చుకుని, మూడోనాటికి మా మఱ్ఱికిందకు తిరిగి వచ్చాడు. నాడీజంఘుడు వీడి దరిద్రం తీరిపోయినందుకు సంతోషించాడు. వీడికి ఆకలిగా ఉందంటే మంచి మంచి పళ్లూ అవీ తెచ్చియిచ్చి తినమన్నాడు. చాలాసేపు కబుర్లు చెప్పుకొన్న తరువాత బ్రాహ్మడికి నిద్రపట్టటం చూచి, తనూ నిద్రపోయాడు. తక్కిన పక్షులం మేమంతా కూడా నిద్రపోయాం. మా నిద్ర మండిపోను! తెల్లవారేవేళకు లేచి చూతుము గదా, ఘోరం! ఈ పాపాత్ముడు మా నాడీజంఘుని మెడ నులిమివేసి ఈకలు పీకేసి, మాంసాన్ని తన అంగవస్త్రంలో మూట కట్టుకుంటున్నాడు."

"ఎంతపని చేశాడు? తిన్న యింటి వాసాలు లెక్కపెట్టాడే! కొంగలరాజువల్ల అంత ఉపకారంపొంది, ఇంతటి దారుణం ఎందుకు చేసినట్టో?" అని నిర్ఘాంత పోయింది, కుక్క.

"ఎందుకేమిటి? మాంసం కోసమే. 'నీ కిదేం పొయికాలంరా?' అని మేమంతా చేరి అడుగుతే వాడే చెప్పేడు."

"ఏమని?"

"'ఈ కొంగ కొవ్వి ఉంది. దీని మాంసం మాంచి రుచిగా ఉంటుంది. ముందు మకాంలో నాకు భోజనం ఇబ్బంది లేకుండా ఉండటాని కీపని చేశాను' అని."

"మీ పక్షులన్నీ చేరి వీణ్ణి పొడిచి చంపెయ్యలేకపోయినయ్యా?"

"నేనా ముసలిదాన్నిఐపోయి బల హీనంగా ఉండటంచేత ఏమీ చెయ్యలేక పోయాను. తక్కిన పక్షులన్నీ సాధువులు కావటంచేత 'దుష్టుడికి దూరంగా ఉంటా' మని పారిపోయినై. చిలక ఒకటి ఎగిరివెళ్లి విరూపాక్షునితో జరిగిన సంగతి అంతా

చెప్పింది. మీ రాజుగారి భటులు మామఱ్ఱి దగ్గర కొచ్చేటప్పటికప్పుడే ఈ కృతఘ్నుడు పై మకాముకు వెళ్లిపోయాడు. మీ రాజ భటులు అక్కడ వానిని పట్టుకుని ఉంటారు. ఈ దుర్మార్గుణ్ణి ఇలా ముక్కలు ముక్కలుగా నరికించి, రాజు మంచి శిక్షే చేశాడులే!"

రాంబందు తల్లికుక్కతో ఇలా అంటూ ఉన్న సమయానికి, ఆ శ్మశానానికి విరూపాక్ష మహారాజు సపరివారంగా వచ్చాడు. ఆయన భటులు మంచిగంధపుచెక్కలతో ఒక చితిని పేర్చారు. ఆయన స్వహస్తాలతో తెచ్చిన ఒక దంతపు పెట్టెను తెరిచి అందులో ఉన్న నాడీజంఘుని ఎముకల్నీ, ప్రేవుల్నీ, ఈకల్నీ పైకితీసి, చితి మీద పెట్టి, ఆ చితికి అగ్నిసంస్కారం చేశాడు. అదంతా చూస్తో నిలబడ్డ రాంబందు కుక్కతో, "చూశావా? స్నేహం అంటే అలా ఉండాలి. మీ రాజుగారు మఱ్ఱిచెట్టు క్రిందపడివున్న నాడీజంఘుని ఎముకలూ, ప్రేగులూ, ఈకలూ తెచ్చి, ఎంత శ్రద్ధతో దహనక్రియలు జరుపుతున్నారో!" అంది.

ఆ సమయాన ఆకాశంనుంచి ఒక విమానం కిందకి దిగివచ్చింది. అందులోంచి



ఒక దివ్యపురుషుడు బయటకువచ్చి, "మహారాజా, నేను ఇంద్రుణ్ణి! నీవు ఈ కొంగపట్ల చూపిన స్నేహానికి మెచ్చుకుని, చేస్తే నీవంటివాని స్నేహమే చెయ్యాలి అని వచ్చాను. ఈ రోజునుంచీ నువ్వు నా మిత్రునిగా ఉండాలి. మన స్నేహానికి గుర్తుగా నీవు ఏదైనా వరం కోరుకుంటే దానిని నెరవేర్చాలని కుతూహలంగా వుంది" అన్నాడు.

అందుకు విరూపాక్షుడు, "దేవేంద్రా, నాడీజంఘుడు లేని జీవితం నాకు దుర్భరంగా ఉంటున్నది. కనుక నా స్నేహితుణ్ణి బ్రతికించు" అని కోరేడు.

ఇంద్రుడు విరూపాక్షుని మైత్రిని ఇప్పుడు మరింత మెచ్చుకుని నాడీజంఘుణ్ణి బ్రతికించేశాడు.

తరువాత విరూపాక్షుడు ఆ కొంగతో జరిగినదంతా చెప్పి, నేలమీద పడివున్న ఆ బ్రాహ్మడి తలను చూపించాడు. నాడీజంఘుడు ఆ తల చూచి దుఃఖిస్తూ "అయ్యో, ఇతణ్ణి ఇలా ఎందుకు చంపించావు మహారాజా?" అన్నాడు. విరూపాక్షుడు ఆశ్చర్యంతో,

"అదేమిటి నాడీజంఘా, అలా అంటున్నావు? వీడు ఎంతటి దుర్మార్గుడో నీకేం తెలుసు? తిన్న యింటి వాసాలు లెక్కపెట్టిన హంతకుడు. బ్రాహ్మణపట్టుక పుట్టాడన్న మాటే గాని, చేసేవన్నీ కిరాతపు పనులే. ఇటువంటి కృతఘ్నుడికి ఏ శిక్ష సరిపోతుంది?" అన్నాడు, విరూపాక్షుడు.

"అయ్యో, ఎంత మాట అన్నావు రాజా!— ఎవడి పాపాన్ని వాడే అనుభవిస్తాడు. దానికి మనం కర్తలం కాము. కాని, నువ్వు ఇచ్చిన డబ్బుతో సుఖపడకుండా యీ బ్రాహ్మడు అకాలమరణం పొందటం నాకిష్టంలేదు. ఇతడు పదికాలాలపాటు బ్రతికి బాగుండాలని నా ఆశ." అంటూ తన వుద్దేశం చెప్పాడు, నాడీజంఘుడు.

"నువ్వు అనేది చాలా వింతగా వుందే. ఎవరైనా అపకారికి ఉపకారం చేస్తారా? ఇంత సత్యకాలంగా మాటాడుతున్నావేమిటి?" అన్నాడు రాజు.

"అపకారికే ఉపకారం చెయ్యాలి." అన్నాడు మళ్ళీ, నాడీజంఘుడు.

ఈ మాట వింటూ అక్కడేవున్న ఇంద్రుడు సంతోషించి, బ్రాహ్మణ్ణికూడా బ్రతికించాడు.

తాను కృతఘ్నుడై ఆ కొంగని చంపినా, అదే పట్టుబట్టి తనను బ్రతికించిన సంగతి తెలిసి బ్రాహ్మడు సిగ్గుపడిపోయాడు.



# ఆదరా బాదరా

ధ్రాచినాపల్లె అనే గ్రామంలో బ్రహ్మన్న అనే కుట్టుపనివాడు ఉండేవాడు. అక్కడ జీవనం గడవక అతను కుటుంబాన్ని తీసుకొని చెన్నపట్నం చేరుకొన్నాడు. బస్తీ చేరుకున్నప్పటినించీ చేతినిండా పనికలిగి, సుఖంగానే కాలక్షేపం గడచిపోతున్నది. ఒక్క ఆరుమాసాలు అయేసరికల్లా బ్రహ్మన్న బాగా ఆర్జించి, కొంతసొమ్ము నిలవకూడా చేశాడు.

ఇంతలో సంక్రాంతిపండగరాగా, అతని భార్య "ఏమండీ! మనం దేశం విడిచి ఏడాది దాటిందే. ఒక్కసారి ఊరికి పోయి మనవాళ్లను చూచి వద్దాం" అంటూ మనసులో కుతూహలం వెల్లడించింది.

"ఓ, అలాగే వెళదాం. నీ కోరిక తీర్చటంకంటే నాకు కావలిసిందేమిటి? నీ సరదా నా సరదా కాదా?" అన్నాడు బ్రహ్మన్న. ఖాతాదారులకు తెలిస్తే, పండగకు బట్టలు కుట్టియివ్వందే వదలరని తలచి, దశమీ బుధవారంరోజున తెల్లవారి ఆరుగంటల ప్యాసెంజరులోనే వెళదాము అని నిశ్చయించుకొన్నారు.

ఏస్టేషనులో ఐనా మరొక్కగంటకు రైలు వస్తుందనగా టికెట్లు ఇస్తారు. కాని చెన్నపట్నంలో అలాకాదు. ఉదయం మొదలు సాయంకాలంవరకూ టికెట్లు అమ్ముతూనే వుంటారు. అందుకని ప్రయాణీకులు తొక్కిడి లేకుండా ముందుగానే కొనుక్కొని ఉంచుకొంటారు.

ఇప్పుడు బ్రహ్మన్న ఉత్సాహంకొద్దీ పోయి మంగళవారం ఉదయానే రెండు టికెట్లు కొని, కోటుజేబులో పెట్టుకొని ఇంటికి చక్కావచ్చాడు. దంపతు లిద్దరూ కలిసి మధ్యాహ్నమల్లా శ్రమపడి ఆకుపచ్చ ట్రంకులో బట్టలూ సామానులూ సర్దుకొన్నారు. మళ్ళీ వ్యవధి ఉంటుంది

ముద్దా సోమప్పశాస్త్రి, పరుశువాకం




ఉండకపోతుంది అని తలచి బ్రహ్మన్న భార్య రాత్రిపూటే వంటచేసేసి సిద్ధంగా వుంచింది. రాత్రి పడకకు కావాలిగనుక పక్కచుట్టు మాత్రం ఇవతల పెట్టారు, ప్రొద్దుటే చుట్టేయవచ్చునని. తక్కిన సరంజామంతా ప్రయాణానికి తయారుగా వుంచారు. "సరిగా ఐదు కొట్టేసరికల్లా మనం లేవాలిసుమా! నీకు ముందు మెలకువవస్తే నువ్వులేపు, నాకు మెలకువవస్తే నేను లేపుతాను" అంటూ దుప్పటి ముసుగుతన్ని పడుకున్నాడు, బ్రహ్మన్న.

పడుకొన్నాడేకాని, ప్రయాణపు గొడవలో అతనికి నిద్రపట్టనేలేదు. ఎలా అయితేం అనుకొన్నట్టు తెల్లవారుజామునే లేచాడు. భార్యను లేపాడు. ఇద్దరూ స్నానం చేసుకొని, చద్దన్నం తినేసి, దుస్తులు వేసికొన్నారు.

ఇక బయల్దేరదాము అనుకొనేసరికి "టికెట్లు ఆనవాలుగా ఉన్నాయా?" అని బ్రహ్మన్నను భార్య అడిగింది. బ్రహ్మన్న కంగారుపడుతూ అక్కడ వెతికాడు, ఇక్కడ వెతికాడు, ఇల్లంతా గాలించాడు. కొంతసేపు ఆలోచించగా, అతడు టికెట్లు కొని చారలకోటులో పెట్టినట్టూ, ఆ కోటు ట్రంకు అడుగున సర్దేసినట్టూ గుర్తు వచ్చింది.

అప్పటికి అరు కొట్టటానికి ముప్పైఐదు నిమిషాలు తక్కువగా వుంది.

బ్రహ్మన్న అప్పుడు భార్యను కోప్పడుతూ 'ట్రంకుపెట్టె తాళంచెవిఇవ్వ' మన్నాడు. కంగారులో ఆమె అక్కడ వెతికింది, ఇక్కడ వెతికింది, ఇల్లంతా గాలించింది. ఎక్కడా కనపడలేదు. కాస్తంత స్తిమితపడి ఆలోచించగా, ఆ తాళంచెవి చీరకొంగున ముడివేసినట్టు ఆమెకు జ్ఞాపకం వచ్చింది. 'ఓసి నీ దుంపతెగా! ఆచీరయేదే?' అంటూ వేగిర



పెట్టాడు, బ్రహ్మన్న. 'చీర చాకలికి వేశాను. వేసేముందు తాళంచెవి విప్పి బొట్టుపెట్టెలో పెట్టినట్టు జ్ఞాపకం' అని చెప్పింది ఆమె.

'ఐతే బొట్టుపెట్టె ఏదీ?' అని బ్రహ్మన్న కంగారుగా ప్రశ్నించాడు.

"అబ్బాయి ఏడుస్తూవుంటే ఊరుకోపెట్టడానికని. వాడికిఇచ్చాను" అన్నది ఆమె.

గబగబలాడుతూ దంపతులిద్దరూ పిల్లవాడు ఆడుకొంటున్న చోటికి పోయిచూచేసరికి ఇకనేముంది, ట్రంకుపెట్టె తాళంచెవి గొంతుకపడి వాడు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు! ఇది చూచి బ్రహ్మన్నకూ భార్యకూ మతిపోయినట్టయింది. బ్రహ్మన్న ధైర్యం తెచ్చుకొని, ఉపాయంచేసి, కుర్రవాడిచేత డోకించేసరికి, తాళంచెవి ఠొళక్కుమని బయటపడింది.

అప్పటికి పావు తక్కువ అరు ఐంది.

క్షణమైనా ఆలస్యం చేయక, వారు ఆ తాళంచెవి పట్టుకువెళ్లి, ఆకుపచ్చ ట్రంకు తెరచి, పెట్టె అడుగునవున్న చారల కోటుజేబులోనించి రెండు టికెట్లూ ఇవతలకుతీసి, తిరుగా పెట్టె సర్దుకొనేసరికి అరుగంటలకు పది నిమిషాలు వుంది.

'ఐనా పరవాలేదు. మన ఇంటికీ స్టేషనుకీ దగ్గరే కనుక రైలు కదులుతూవున్నా ఎక్కెయవచ్చు' అని బ్రహ్మన్న గుండె నిబ్బరం తెచ్చుకుని, భార్యనూ పిల్లవాడినీ వెంటబెట్టుకుని, పక్కచుట్ట చంకను బెట్టుకొని బయల్దేరాడు.

బయల్దేరి నాలుగడుగులు వేశారో లేదో ఆ కంగారులో డబ్బుసంచీ ఇంట్లో వదిలేసినట్టు జ్ఞాపకం వచ్చిందతనికి. దేవుడా అంటూ వెనక్కిపోయి, పర్సు వెతుక్కొని పట్టుకవచ్చాడు, బ్రహ్మన్న.

అప్పటికి ఆరుకి ఐదు నిమిషాలు మాత్రమే ఉన్నది.

తీరా మళ్ళీ బయల్దేరి పదిగజాలు సాగేటప్పటికి "ఏమండీ, ఇంటి తాళం సరిగా పడిందో లేదో జాగర్తగా లాగిచూశారా? చూడబోతే కాలమానం బాగులేదు..." అని అనుమానంపెట్టింది బ్రహ్మన్న భార్య.

'ఆడవాళ్లతో ప్రయాణం...ఎప్పుడూ యింతే?' అని భార్యపైన కారాలూ మిరియాలూ నూరుతూ 'మీరు నడుస్తూ వుండడి' అని వాళ్లతోచెప్పి బ్రహ్మన్న మళ్లీ ఇంటికి పోయి తాళం జాగర్తగా లాగి చూచి తిరిగివచ్చాడు.

'అడుగడుక్కీ అనుమానాలు వస్తున్నాయి, అందుచేత రైలుకి పోవటానికి ఆలస్యమైపోతున్నది' అనే వుద్దేశంతో బ్రహ్మన్న ప్రయాణపు సరంజామంతా సరిగా ఉన్నదీ లేనిదీ మళ్లీ ఒక్కసారి నిదానంగా చూచుకొన్నాడు: "ఇదుగో కోటుంది. కోటుజేబీలో రెండు టిక్కెట్లూ ఉన్నయ్. డబ్బుసంచీ వున్నది. ఆకుపచ్చ ట్రంకుపెట్టె వున్నదీ. పక్కచుట్ట ఉంది. తాళంచెవి ఉన్నది. దేముడు మేలుచేస్తే అబ్బాయి ఉన్నాడు. నా భార్య ఇక్కడే వుంది, నేనూ వున్నాను..." దారిలో ఇలా అనుకొంటూవుండగానే టంగ్ టంగ్ మని అరుగంటలూ కొట్టేసింది. రైలు కూసిన చప్పుడుకూడా వినపడింది.

ఇంతలోనే స్టేషనునించి వస్తున్న ప్రయాణీకులు రైలు వెళ్లిపోయిందని చెప్పారు. చేసేదేముందీ? కంగారుపడే బ్రహ్మన్న దంపతుల ప్రయాణం చివరికి ఇలా తేలింది.

తీరా బ్రహ్మన్న ఇంటికి తిరిగివచ్చేసరికి కాతాదారులందరూ వానిని చుట్టేసి, "ఏం బ్రహ్మన్నా! మా పండగ దుస్తులు కుట్టి యివ్వకుండా పోదామంటే ప్రయాణం సాగుతుందనుకున్నావా? నీకు తగిన శాస్తి జరిగిందిలే" అంటూ అతన్ని వేళాకోళం చేశారు. బ్రహ్మన్న కిక్కురుమనలేదు.





# తగిన కానుక

పూర్వకాలమందు మగధదేశాన్ని ధర్మగుప్తుడు అనే రాజు పాలించుతూ ఉండేవాడు. ఆయనకు ఒక్కగానొక్క కుమార్తె. ఆమె సాటిలేని రూపసి, దైవభక్తి కలదిన్ని. అపురూపంగా పుట్టిన ఆ సౌందర్యవతిని చూచుకొని, రాజు మురిసిపోయేవాడు.

"నా ముద్దుబిడ్డ ఇందువదనను ఎప్పటికైనా దైవభక్తి గల ఒక మహారాజుకి ఇచ్చి పెళ్లిచేస్తాను" అంటూ ప్రతిజ్ఞ పూనాడు.

ఇందువదన పెరిగి పెద్దదైంది. దేశదేశాలనుంచి ఎంతరెందరో శ్రీమంతులు పిల్లను చూడవచ్చేవారు. కానైతే, తను అనుకొన్న సుగుణాలన్నీ ఒక్కరిలోనూ కనపడకపోవటంచేత, ధర్మగుప్తుడికి ఎవళ్లూ నచ్చలేదు. కనుక, ఆ వచ్చినవాళ్లు వచ్చిన దారినే మరలిపోయేవారు.

ఇందువదన విరక్తిభావంతో ఒకరోజున గదిలో కూర్చుని, ఆలోచింప సాగింది:

"జీవితమంటే ఇవేనా?— తిండీ, నిద్రా తప్ప మరేమీ వ్యాపకంలేదా? నేను ఒంటిపాటుగా బ్రతకవలసిందేనా?" అని. ఆలా విచారిస్తుండగా కోటలో ఏదో సందడి వినవచ్చింది.

అదివిని "ఏమిటీ సందడి? నా జీవితంలో ఒక గొప్ప మార్పు రాబోతుందని మనస్సు మరిమరి చెబుతున్నదే! ఈ సందడి అటువంటి మార్పునకు సంబంధించినదై వుంటుందా!" అని అనుకొన్నది.

అంతలోనే చెలికత్తెలు ఉరుకులు వేసుకొంటూవచ్చి, ఇందువదనను చుట్టేసి కొత్తగా చూడవచ్చిన కళింగరాజకుమారుని గురించి ఊబుసులాడజొచ్చారు. వారు ఊసులాడుకొంటూండగానే మంత్రి వచ్చి ఆమెను రాజువద్దకు తీసుకపోయాడు.

ధర్మగుప్తుడు ఆమెను చేరదీసుకొని, "అమ్మా! మన అదృష్టం ఫలించి,

యస్. కళ్యాణి, బందరు



పుట్టింది నాకు" అని తండి చెప్పేసరికి, ఇందువదన ఆనందంతో సమ్మతించింది.

మరికొద్ది రోజులకే మంచిముహూర్తాన, ఇందువదనను కళింగరాజకుమారుడైన కృపావర్మకు ఇచ్చి వివాహం చేశారు. ఆమె అత్తవారింటికి బయల్దేరి వెళ్ళేరోజున తన దేవి ఆలయానికి వెళ్ళి, భక్తితో పూజించి "కళింగరాజ్య మంతటిలో దొరికే విలువైన వస్తువు నీకు కానుకగా సమర్పించు కొంటాను తల్లీ!" అని మొక్కింది.

ఇందువదన, కృపావర్మ చిలుకా గోరింకలవలె అన్యోన్యంగా ఉండేవారు. అమె ఏమి కోరినప్పటికీ, తలుచుకొన్నం తనే సమకూర్చేవాడు కృపావర్మ. ఆమె సంతోషమే తన సంతోషంగా ఎంచి, ఇందువదనను అపురూపంగా చూచుకొంటున్నాడు. ఇంత చేసినా, అమె ఏదో ఒక విధమైన బెంగతో ఉన్నట్టు కనపడేది. ఆమెలోని వైరాగ్యభావం కనిపెట్టిన కృపావర్మ, ఒకరోజున ఆమెను బుజ్జగించి, ఈ విచారమునకు కారణమేమిటని అడిగేటప్పటికి, తను దేవికి చేసిన వాగ్దానంగురించి వెల్లడించింది.

"ఈపాటి దానికి ఇంత బెంగ ఎందుకు? మనరాజ్యంలోకల్లా విలువైన వస్తువులు

ఈనాటికి నీకు తగిన సంబంధం వచ్చింది" అంటూ, కళింగరాజకుమారుని గురించిన వివరాలన్నీ ఆమెకు తెలియచెప్పాడు.

తండ్రి చెప్పినదంతా శ్రద్ధగా విన్న తరువాత ఇందువదన "నాయనగారూ!- మీరు చెప్పిన ఐశ్వర్యము లన్నిటికంటే నాకు నా దేవిని సంతోషపెట్టడమే ఎక్కువ. కళింగరాజకుమారులు నా దేవికి తగిన కానుకను ఈయగలరా?" అని అడిగింది.

"తప్పకుండా ఇస్తాడమ్మా! చిన్ననాటి నుంచీ అతన్ని నేను ఎరుగుదును. నీలాగనే దైవపూజ అంటే ఆసక్తికలవాడు. కనుకనే, ఈ సంబంధానికి వప్పుకొన బుద్ధి

తెప్పించుతాను. అందులో నీకు నచ్చినది తీసుకుని దేవికి సమర్పించవచ్చు. నీ కోరిక తీర్చడంకంటె నాకు కావలసిన దేమున్నది?" అని తక్షణమే రాజ్యంలోని గొప్పగొప్ప వర్తకులందర్నీ పిలిపించాడు.

వారు చిత్రవిచిత్రమైన కానుకలెన్నో పట్టుకువచ్చి రాజు ఎదట ఉంచారు. ఇందు వదన అవన్నీ వేడుకతో పరిశీలించగా, అన్నింటిలోనూ ఒకే ఒక వస్తువు ఆమెను ఆకర్షించింది. అదే కాంతివజ్రం!- అది ఉన్నచోటునుంచి చుట్టూ ఒక క్రోశెడు దూరంవరకూ ప్రకాశిస్తూ వుంటుంది.



తన ఇందువదన ప్రియంగా ఎంచుకొన్న అపురూపవస్తువు లభించినందుకు కృపావర్మకూ అపరిమితమైన సంతోష మైంది. లక్షలకొద్ది వరహాలుపోసి ఆ కాంతి వజ్రాన్ని కొని, భార్యకు ఇచ్చాడు. ఆమె ఆనందానికి మేరలేకపోయింది.

దంపతు లిద్దరూ కలిసి మగధరాజ్యా నికి కాలినడకను యాత్రచేసి, అపరూప మైన ఆ కాంతివజ్రాన్ని దేవికి సమర్పించి వద్దామని నిశ్చయించుకొన్నారు.

మరునాడు వారు మగధరాజ్యానికి పాదచారులై బయలుదేరి గుట్టలు, పుట్టలు, మెట్టలు, మహారణ్యాలు దాటుకుని, చివ రకు ఒక పెద్ద నదివద్దకు చేరుకొన్నారు. ఆ నది దాటినతరువాత మగధరాజ్యానికి ఇంకకొంచెం దూరమే ఉన్నది. దంపతులు ఉత్సాహంతో నదినిదాటి, గట్టుపైన నిల బడ్డారు. కొంచెం విశ్రాంతి తీసుకుని, తరవాత మళ్లీ కాలు సాగించువామని అనుకుంటుండగా, కాంతివజ్రం యొక్క కిరణాలు ప్రసరించటం కనబడలేదు.

"ఇదేమిటి విడ్డూరం!- నేను స్వయంగా చేతితో జాగ్రత్తగా పట్టుకొని వుంటనే, వజ్రం ఏమైపోయింది!" అంటూ కృపావర్మ కంగారు పడ్డాడు. ఇందువదనకు తత్తర




పాటు కలిగింది, "బహుశా, అది ఏటిలో జారిపోయివుంటుందని తలచి, దాన్ని వెతికి తీసుకురాగలిగినవాళ్ళకు "ఏమి కోరుకుంటే అది ఇస్తాము" అని కృపావర్మ అక్కడి బెస్తవాళ్ళతో అన్నాడు.

యువకులందరూ 'మావల్ల కా' దంటే 'మావల్ల కా'దని తప్పుకొనిపోయారు. కాని, ఒక ముసిలివాడుమాత్రం వారి ఎదటికి వచ్చి "స్వామీ!- నాకు ఒక్కటే కోరిక ఉన్నది, అది నెరవేరిస్తే ప్రాణానికైనా తెగించి, మీరు కోరిన కాంతివజ్రం పట్టి తెస్తాను" అన్నాడు. అది యేమిటని కృపావర్మ అడిగితే, "నాకు ఒకే ఒక కుమారుడు ఉన్నాడు. వాడికి మర్యాదగల జీవనోపాధి కల్పించాలి" అన్నాడు. "తప్పక అలాగే చేస్తా"నని కృపావర్మ వాగ్దానం చేసేసరికి ముసిలివాడు బుడుంగున ఏటి అడుగునకంటా మునిగిపోయి, అనేకమైన జలచరాలతోనూ, క్రూరసర్పాలతోనూ పోట్లాడి జయించి, చివరకు ఒక బ్రహ్మాండమైన చేపను లాక్కొని వచ్చాడు. "స్వామీ!- మీ వజ్రాన్ని మింగిన చేప ఇదే..." అని అనేటంతలో ఆ చేప, తన పెద్ద వాలముతో ముసిలివాణ్ణి ఒక్క దెబ్బ కొట్టింది. దెబ్బతో వాడు నీటిలో అలానే సోలిపోయి, మరి కనపడకుండా పోయాడు.

కృపావర్మ ఆ చేపను కోసి వజ్రం బయటకు తీసేసరికి, వింత చూడటానికి చుట్టూ జనం మూగారు. కాంతివజ్రం దొరికినందుకు దంపతులు సంతోషిస్తూ, ఇక బయల్దేరి పోదామనుకుంటూవుండగా, ఎక్కడినించో ఒక గుంటనక్కవచ్చి ఆ వజ్రాన్ని నోట కరుచుకుని పరుగుతీసింది.

కృపావర్మ ఆ గుంటనక్కను వెంబడించాడు. అది అతి వేగంగా మూడు క్రోసులుదూరం పరుగెత్తి, ఆ వజ్రాన్ని ఒక తుప్పలో వదిలేసి మాయమైంది. పాపం,



కృపావర్మ కాయకష్టంపడి, ఆ మూడు క్రోసులూ నక్క వెంట పరుగెత్తి, అది వదిలేసినవజ్రాన్ని ఎలాగో మళ్లీ పట్టుకున్నాడు.

దంపతులు అలసట తీర్చుకుందామని ఒక చెట్టుకింద నడుము వాల్చి ఊసులు చెప్పుకొంటూవున్నారు. దేవి దర్శనం చేసుకొని, అపూర్వమైన ఈ కాంతివజ్రం సమర్పించుదామని ఇందువదన ఎంతో ఆత్రపడుతూవుంటే, తలవని తలంపుగా ఇటువంటి ఆటంకాలు తగిలి, ఆలస్యమై పోతున్నదే అని ఆమె కించపడజొచ్చింది.



వారు ఇలా ప్రసంగించుకొంటూ వుండగా, కృపావర్మ ఎంతో భద్రంగా తలక్రింద పెట్టుకొనివున్న కాంతివజ్రాన్ని ఒక గరుడపక్షి వచ్చి తన్నుకుపోయింది. అదేమి చిత్రమో కాని, ఆ గరుడపక్షి తన దారిని తను ఎగిరిపోక, వారికి అందుబాటులో ఉండి, చుట్టూ తిరుగసాగింది.

ఇదిచూచి ఇందువదన, "పక్షి పట్టుకపోయిన వస్తువు ఇంక దొరికేదేమిటి? అది కేవలమూ అసాధ్యం." అనుకొని నిస్పృహ చెందింది. 'నా దేవిని సంతోష పెట్టలేకపోయాను, మాట నిలబెట్టుకో లేకపోయిన దురదృష్టవంతురాలను. నేను ఉండేమి లేకేమి?' అని ఆమె తనను తనే నిందించుకొంటూ, ఆ గరుడపక్షి ఎగురుతున్న దారినే వెంబడించింది.

తనకి ఇష్టంలేకపోయినా కృపావర్మ భార్యమీది ప్రేమచేత, ఇందువదన వెంట పోజొచ్చాడు. ఈ విధంగా, గగనమార్గాన గరుడపక్షి, భూమిమీద కృపావర్మ ఇందువదనలూ అలా తిరుగుతూనే వున్నారు.

కొంతదూరం అలా పోయిన తరువాత గరుడపక్షి వాయువేగంతో ఈశాన్యదిక్కుకు ఎగిరిపోయి అదృశ్యమయింది. దంపతులు ఆ పక్షిని ఇక వెంబడించలేక, అది ఎగిరి పోయిన దిక్కున అంతులేని దూరం నడువ



జొచ్చారు. చీకటి పడేవరకు తిరిగి తిరిగి, వారు ఏమీ తోచక చతికిలబడ్డారు.

మరి కొంచెంసేపటికి ఆ కటిక చీకటిలో ఒక దిక్కున గొప్ప వెలుగు కనిపించేసరికి, అవెలుగు ఏమిటో వారు సరిగ్గా గుర్తించలేక పోయారు కాని, అటువంటి వెలుగుతో వారికి ఇంతకుముందు పరిచయం ఉన్నట్టు మనస్సుకు తట్టింది. ఈ విడ్డూర మేమిటో చూచి తెలుసుకోవాలెననే కుతూహలంతో, లేనిబలం తెచ్చిపెట్టుకొని, ఆ వెలుగు కన పడే దిక్కుకు కాలు సాగించారు.

ఎలా ఐతేనేం, ఆ స్థలం చేరుకోగా, అది ఒక దేవాలయంలో వెలుగుతూవున్న జ్యోతి లాగా కనపడింది. తీరా లోపలకు వెళ్ళి చూచేసరికి, వారి ఆశ్చర్యానికి అంతులేక పోయింది. అది ఇందువదనకు ఇష్టదైవము ఐన దేవి ఆలయం! ఆలయంలో దేవి శిరస్సునుండి ప్రకాశిస్తూవున్నది వారు పోగొట్టుకొన్న 'కాంతివజ్రం!!' తమకు దారి తెలియకుండానే ఆ కటికచీకటిలో వారు మగధరాజ్యంలోకి వచ్చేశారు.

ఇంతకుపూర్వం అనేకమైన కష్టాలు పడవలసిరావటం, ఇప్పుడు ఈ విధంగా వారి సంకల్పం సిద్ధించి మేలు చేకూరటం, ఇదంతా ఆ దేవి మహిమ తప్ప వేరు కాదని వారు నమ్మారు. అప్పటినించీ వారికి దైవభక్తి మునుపటికంటె కూడా ఎక్కు వైంది. భక్తురాలైన తన కుమార్తెకు తగిన భర్త దొరకటం గొప్ప అదృష్టంగా భావించాడు ధర్మగుప్తుడు. దేవికి తగిన కానుక సమర్పించగలిగానని ఇందువదన పొంగిపోయింది. అనుకూలవతి అయిన భార్య దొరికినందుకు కృపావర్మ 'కృతార్థుణ్ణి' అనుకొన్నాడు.

ఇందువదన, కృపావర్మలు మళ్ళీ తమ రాజ్యం చేరుకొన్నవెంటనే బెస్తవాని కొడుకును పిలిపించి, అతన్ని సేనాధిపతిగా నియమించి, మాట నిలబెట్టుకొన్నాడు.





# రక్షరేకు

పల్నాటిసీమలో ఒకపల్లె ఉంది. ఆపల్లెలో చంద్రమ్మ అనే ఒక ముసలమ్మ ఉంది. ఆ ముసలమ్మకు ధర్మమ్మ అనే కూతురూ, ఆ కూతురికి శేషు అనే ఒకే ఒక్క కొడుకూ ఉన్నారు. ధర్మమ్మ మగడు హనుమారెడ్డి, చంద్రమ్మభర్త చెంగారెడ్డి గొప్పవీరులు. ఆ అల్లుడు మామ లిద్దరూ పలనాటి యుద్ధంలో తమ రాజు పక్షాన్ని శౌర్యంతో పోరాడి ప్రాణాలు విడిచి వీర స్వర్గం పొందేరు. శేషు అప్పటికి ఆరు నెలలేనా నిండని నూనెబిడ్డ. వాణ్ణి ఎంతో ఆప్యాయంగా పెంచుకొంటూ, ఆ తల్లీ అమ్మమ్మా భర్తలు పోయారన్న దుఃఖం దిగమ్రింగుకున్నారు.

ఏణ్ణర్ధం వయసులో శేషు ఒకమాటు పిడుగు చప్పుడుకి జడుసుకున్నాడు. పెరిగి పెద్దవాడు అయినా, ఆ అదటూ భయమూ వాణ్ణి పట్టుకు వదలలేదు. తోటిపిల్లలంతా వాణ్ణి ఉత్తి పిరికిపందక్రింద జమకట్టి, ఎదురు ఐనప్పుడల్లా వాణ్ణి వేళాకోళాలుచేసి ఏడిపిస్తోండేవారు.

శేషు పిరికితనాన్నిచూసి, ధర్మమ్మా, చంద్రమ్మా చాలా విచారించారు. ఆ పిరికితనం ఎలా పోగొట్టడమా అని వాళ్ళు రాత్రిం బవళ్ళు ఆలోచించారు. ఆఖరికి చంద్రమ్మకు ఒక ఆలోచన తట్టింది. ఒక నాడు శేషు తోటిపిల్లలతో ఆటలకు వెళ్ళి మామూలుప్రకారం వాళ్ళచేత దెబ్బలుతిని యేడుస్తో వచ్చాడు. చంద్రమ్మ వాణ్ణి చూసి. "ఎవళ్ళయినా కొడితే తిరగబడి బాదాలి కాని, చచ్చు నాగమ్మలాగ ఏడుస్తో రావటం ఏమిటి? మీ నాన్నా, తాతా నీకుమల్లే భయపడ్డారా? కత్తులు పుచ్చుకుని యుద్ధానికెళ్ళి శత్రువుల్ని సంహరించేసేవారు. నువ్వుకూడా వాళ్లలాగే, వీరుడవై యుద్ధానికి వెళ్ళాలి" అన్నది.

తాతపూడి వీరవెంకటసత్యం, అమలాపురం



"అమ్మో! యుద్ధమే? ఆమాట చెపుతేనే నాకు గుండెలు కొట్టుకుంటున్నయి." అన్నాడు శేషు.

అందుకు ఆమె, "అబ్బాయీ! నీకు వచ్చిన భయమేమీ లేదు. గొప్ప తపశ్శాలి ఐనటువంటి ఒక మహాయోగి ఇచ్చిన రక్ష రేకు మహిమవల్ల నీ తండ్రి తాతలు యుద్ధాలలో విజయం పొందారు. దానిని ధరించటంవల్ల మనిషిలో వీరలక్షణాలు పుట్టుకొస్తయి. ఏమంటే ఆయన మీనాయనకూ, తాతకూ ఇచ్చివెళ్ళిన రక్షరేకులు రెండూ ఇప్పుడు మనింట్లోనే ఉన్నాయి. వాటిల్లో ఒకటి నువ్వు కట్టుకుని వెళ్ళు. అది నీ వంటిమీద ఉన్నంతకాలం నీవు బలవంతుడవూ ధైర్యవంతుడవూ అవుతావు. ఎవళ్ళూ నిన్ను ఏమీ చెయ్యలేరు" అన్నది.

"సరే" అన్నాడు శేషారెడ్డి. చంద్రమ్మ లోపలికి వెళ్ళి, తన సందుగుపెట్టెలో ఏనాటినుంచో పడిఉన్న రాగి నానుకోడు ఒకటి పైకి తీసి, దానికొక తాడుకట్టి తెచ్చి మనమడికి ఇచ్చింది. శేషారెడ్డి అదినిజంగా యోగీశ్వరుడు ఇచ్చి వెళ్ళిన రక్షరేకు అనే అనుకుని, వెంటనే దాన్ని తన దండకు కట్టుకున్నాడు. దాని మహిమను పరీక్షించాలని తోచి వాడు ఒక్క క్షణం కూడా అక్కడ నిలబడక పిల్లలంతా బొంగరాలు తిప్పుకునే మైదానంలోకి పరుగెత్తి వెళ్ళేడు.

"ఇంక ఎవరువస్తారో రండి డొక్క చీల్చేస్తాను!" అని అరిచాడు. పిల్లలందరికీ ఆశ్చర్యం వేసింది. 'ఏమిట్రా అలా చూస్తో నిలబడిపోయారు, పట్టుకుని చితగ్గొట్టక?' అన్నాడు వాళ్ళ నాయకుడు. ఒక్క మాటుగా వాళ్ళందరూ శేషారెడ్డిని చుట్టుముట్టేరు. ఐతేం? శేషారెడ్డి అదివరకు మల్లే గాకుండా శివమెత్తిన వాడిలాగ ఎగిరి పడుతో తలకొక గుద్దూ ఇచ్చుతున్నాడు. మదపుటేనుగులగుంపులో దుమికిన





సింహపు పిల్లకుమల్లే గర్జిస్తూ వాళ్ళందర్నీ చెల్లా చెదరు చేసేశాడు. 'వీడికి ఈ కొత్త బలం ఎక్కడనుంచి వచ్చిందిరా?' అనుకుంటూ వాళ్ళంతా దెబ్బలు తగిలినచోట తడుముకుంటూ పారిపోయారు. శేషారెడ్డి విజయగర్వంతో ఇంటికి పోయి, 'రక్షరేకు పనిచేసింద'ని ఎగురుతో అమ్మమ్మకు, చెప్పేడు. చంద్రమ్మ తన యుక్తి ఫలించినందుకు లోలోపల సంతోషించింది.

శేషారెడ్డి పెద్దవాడై కత్తిసాము నేర్చి, కొండవీడు రాజ్యానికిపోయి, ఆ రాజుగారి సేనలో చేరేడు. కొద్దికాలానికే అతడు తండ్రినీ, తాతనూ మించిన వీరుడనిపించుకున్నాడు. కొండవీడు రాజు, అతని ధైర్య సాహసాలకు మెచ్చుకొని, ఒక చిన్న సైనిక దళానికి అతన్ని అధిపతిగా చేశాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకే కొండవీటి రాజు శత్రురాజులమీదికి దండెత్తిపోవలసి వచ్చింది. దుర్గాన్ని కాపాడుతూ ఉండటానికి శేషారెడ్డిని అతని సైన్యంతో అక్కడ ఉంచేసి రాజు, తక్కిన సైన్యమంతా వెంటబెట్టుకుని దండయాత్ర సాగించాడు. ఈ సంగతి తెలిసిన నవాబు ఒకడు కొండవీడును వశంచేసుకోవటానికి ఇదే సమయమని తలచి, తన సైన్యంతో వచ్చి ఆ దుర్గాన్ని ముట్టడించాడు. దుర్గాన్ని రక్షిస్తోన్న శేషారెడ్డి సైన్యం నవాబుసైన్యంతో పోల్చి చూస్తే చాలా తక్కువ. తండోపతండాలుగా వచ్చి పడుతూన్న నవాబు సైన్యాన్ని చూచేటప్పటికి శేషారెడ్డికి మొదట చాలా అధైర్యంవేసింది. కాని అతనికి మొలలో ఉన్న రక్షరేకుమాట జ్ఞాపకానికొచ్చి గొప్ప ధైర్యం వచ్చింది.

నవాబు ముట్టడిచేశాడన్న వార్తను తెలియచెయ్యటానికి అతడు వెంటనే తన రాజుగారివద్దకు చారులను పంపి, తన సైనికులతో కోట దర్వాజావద్ద నిలబడి



వచ్చిన శత్రుసైనికుల నందర్నీ నరకటం మొదలెట్టేడు. అతని సాహసం చూసేటప్పటికి అతని సైనికులకు కొండంత ఉత్సాహం వచ్చి, వాళ్లల్లో ఒక్కొక్కడూ నూరు మంది పెట్టుగా, శత్రువుల్ని నరకటం మొదలెట్టేరు. తృటిలో కొండవీడు తమ వశమౌతుందనుకుని వచ్చిన నవాబు సైన్యం కోటలో ప్రవేశించ లేక పోవటమేగాక, చాలామంది హతులైనారు.

ఇంతలో దండయాత్రకు వెళ్లిన కొండవీటి రాజు సైన్యంతో వెనక్కి తిరిగివచ్చి నవాబు సైనికుల్ని డీకొన్నాడు. ఒకప్రక్క రాజుగారిసైన్యం రెండోప్రక్క శేషారెడ్డి సైన్యం నవాబు సైనికుల్ని డీకొని చెల్లాచెదరుచేసి తరిమివేశాయి. తను వచ్చే వరకూ కోట శత్రువులకు చిక్కకుండా రక్షించగలిగినందుకు రాజు శేషారెడ్డిని మెచ్చుకుని, ఎన్నో బహుమానాలూ, బిరుదులూ ఇచ్చి గౌరవించాడు. శేషారెడ్డి బహుమతులన్నీ తెచ్చి అమ్మమ్మకు చూపెట్టి, "అమ్మమ్మా, ఇదంతా నువ్వు కట్టిన రక్షరేకు యొక్క మహిమ యే సుమా!" అన్నాడు.

చందమ్మ ఏనాడో తాను మనుమడి మొలలో కట్టిన ఆ రాగి నానుకోడు మాట మరిచేపోయింది! మనుమడు జ్ఞాపకం చేసేటప్పటికి, "నాయనా, అది ఇంకా మొలలోనే ఉందా? దానిని నువ్వు నిజంగా రక్షరేకు అనే అనుకుంటున్నావా?" అంది.

శేషారెడ్డి తెల్లబోయి, "అది రక్షరేకు కాదా? యోగి ఇవ్వలేదా?" అని అడిగేడు.

దానికి చంద్రమ్మ, "యోగీలేడు; రక్షరేకూ లేదు. ఇదంతా నీ పిరికితనాన్ని పోగొట్టటానికి నేను చేసిన యుక్తి" అంది.

"ఏదైతేం, అమ్మమ్మా! నాతండ్రి, తాతల పేరూ, ప్రఖ్యాతీ, నిలబెట్టింది!" అంటూ శేషారెడ్డి ముసలమ్మకు సాగిలపడ్డాడు.



నెమలి ఫించంలోని ఈకలని
'నెమలి కన్నులు' అంటారు



# ఎందుకో తెలుసా?

సాగరమహారాజు కూతురు స్వర్ణముఖి. ఆమె త్రిలోకసుందరి. స్వర్ణముఖి అందం చూచి బృహస్పతి ఆమెను ప్రేమించాడు. ఐతే ఈమె తనకూడా ఉండటం చూచినట్లయితే తన భార్య తార అసూయపడుతుందనే కారణంచేత, ఈ రహస్యం ఆమెకు తెలియకుండా స్వర్ణముఖిని దేవలోకంలోకి తీసుకవచ్చి, మంత్రమహిమ వల్ల ఒక ఆవుదూడగా మార్చివేశాడు.

ఆ ఆవుదూడను చూచి తార ముచ్చటపడి దానిని తనకు ఇస్తేకాని వీలులేదని పట్టుపట్టింది. చేసేదిలేక బృహస్పతి ఆవుదూడను ఆమెకు బహుమతిగా ఇచ్చివేశాడు. ఆమె దాన్ని ప్రాణంగా ఎంచుకొంటూ, మేపుకొని రావటానికని శతనేత్రుడనేవానికి వప్పగించింది.

ఒకనాడు శతనేత్రుడు ఆవుదూడను భూలోకానికి తీసుకపోయి మేపుతూవుండగా, కూతురుకోసం తల్లడిల్లి తిరుగుతూవున్న సాగరమహారాజు వెతుక్కొంటూ అక్కడికి వచ్చాడు. ఆయన ఆవుదూడను చూచాడుకాని, అది తన కూతురేనని అతనికేం తెలుసు?—చూడగానే తండ్రిని ఆనవాలుపట్టింది స్వర్ణముఖి. తండ్రికి తన అవస్థ తెలియజేదామనుకొన్నది కాని, పశురూపంలో ఉండటంవల్ల 'అంబా!' అనటంతప్ప మరేమీ చెప్పలేకపోయింది. అప్పుడు ఆమె తండ్రికి కనపడేటట్టు 'స్వ-ర్ణ' అనే రెండు అక్షరాలు తన డెక్కతో నేలమీద రాసేసరికి సాగరుడు నిజస్థితి గ్రహించి విచారింపజొచ్చాడు.

సాగరుని ముఖచర్యలు కనిపెట్టిన శతనేత్రుడు "వీడెవడో, ఈ దూడను కాస్తా కాజెయ్యటానికి వచ్చిన మాయలవాడులా ఉన్నాడ"ని శంకించి సాగరుణ్ని కసిరి కొట్టాడు. ఆ క్షణంనించీ తన నూరు

కనులతోను అతిజాగర్తగా ఆ ఆవుదూడను కాపలా కాస్తున్నాడు.

సాగరుడు ఇంటికి వెళ్లినతరువాత బుధుడివద్దకు పోయి ఏ సాధనంచేతనైనా తన కూతురు స్వర్ణముఖిని తన ఎదట పెట్టుమంటూ బతిమలాడాడు.

బుధుడు సాగరునికి సాయంచేస్తానని మాటయిచ్చి, గొల్లవాని వేషంతో శతనేత్రుడున్న మైదానం చేరుకున్నాడు. అతను శతనేత్రుని దగ్గరే కూర్చొని ఆమాటా ఈ మాటా చెప్పగా వాడు ఆసక్తితో విననారంభించాడు. ఇదిచూచి నిదపోతాడేమోనని హాయిగొలిపే పాటలు పాడాడు. కాని శతనేత్రుడు కన్నులు మరింత తెరుచుకుని వినసాగాడు. బుధుడు కొన్ని విసుగు తెప్పించే పాటలు పాడాడు. లాభం లేక పోయింది. తరవాత భీకరమైన రాక్షసుల కథలు, వీరుల కథలు, హాస్య కథలు చెప్పాడు. ఉహు! వాడికి కునుకుపట్టనే లేదు. బుధుడు ఇంక ఆఖరిప్రయత్నంగా ఒక అంతులేనికథ చెప్పతూవుండగా విసుగుచేత శతనేత్రుడికళ్లు రెండేసి రెండేసి చొప్పున మూతపడజొచ్చినై. ఇంక ఒక్క జత కళ్లుమాత్రం ఆవుదూడవేపు చూస్తూ వుండిపోయాయి. అవి ఎంతకూ మూతపడేటట్టు కనపడలేదు. అప్పుడు బుధుడు తనదగ్గరవున్న డబ్బిలోంచి కొంచెం పుష్పరసం వాసన చూపాడు. ఆవాసన తగలగానే మిగిలిన జతకళ్ళు కూడా మూసుకుపోయాయి. అదే సమయమని బుధుడు ఆవుదూడను తీసుక పోయి సాగరమహారాజుకి వప్పగించాడు.

శతనేత్రుడు చేతులు నులుముకొంటూ తార ఎదటికి పోయేసరికి ఆమె ఉగ్రురాలై అందంగా మెరిసే వాని నూరుకన్నులనూ పీకించి తన నెమిలిపురిలో అమర్చివేసింది. నాటినించీ నెమలి ఈకలని "నెమలి కన్నులు" అనటం వాడుకలోకి వచ్చింది.



| | | | | |
|---|---|---|---|---|
|  |  |  |  | — — — — = మీకు ఇష్టమైనది |
|  |  |  |  | — — — — = తలంపు |
|  |  |  |  | — — — — = చెట్టు |
|  |  |  |  | — — — — = గాలి |

ఇక్కడ 1, 2, 3, 4 అంకెలూ, ఒక్కొక్క అంకెకు ఎదురుగా నాలుగేసి బొమ్మలూ వున్నాయి కదూ? 1-వ నెంబరుకు ఎదురుగా వున్న నాలుగు బొమ్మలు ఏమిటో గ్రహించి, ఆ బొమ్మల క్రింద మీరు గ్రహించిన మాట రాయాలి. అదేవిధంగా 2, 3, 4 అంకెలకు ఎదురుగావున్న బొమ్మల క్రిందకూడా మాటలు వ్రాయాలి. ఆతర్వాత ఒక్కొక్క నెంబరుకు ఎదురుగా వ్రాసిన ప్రతిమాటలోని మొదటి అక్షరం తీసి, వరుసగా చివరి గడిలో వ్రాయాలి. ఆ నాలుగు అక్షరాలు కలిపి చదివినట్లయితే చివరి గడిలో ఇచ్చిన అర్థం వచ్చే మాట వస్తుంది. మీకు తెలియకపోతే జవాబుకి 50-వ పేజీ చూడండి.

## పేజి, పంక్తి, మాట చెప్పటం

నీ యిష్టంవచ్చిన పుస్తకం తీసుకో. అందులో నీయిష్టమొచ్చిన పేజీ తెరు. ఆ పేజీ నాకు కనపడనివ్వకు. ఆపేజీలో మొదటి పది పంక్తులలోపల కుట్టుదగ్గిర ఉండే మాటల్లో ఏదో ఒకమాట గుర్తు పెట్టుకో. నేను చెప్పినట్టు చేస్తే, నువ్వు ఎన్నో పేజీలో ఎన్నో పంక్తిలో ఎన్నోమాట ఎంచుకున్నావో చెప్పేస్తాను.

నువ్వు ఎంచుకొన్న పేజీనంబరు వ్రాసుకో.
దాన్ని రెట్టింపు చెయ్యి.
వచ్చిన మొత్తాన్ని 5 చేత గుణించు.
ఆ వచ్చిన సంఖ్యకు 20 కలుపు.
నువు ఎంచుకున్న పంక్తి ఎన్నోదో దానికి కలుపు.
దానికి 5 కలుపు.
వచ్చిన మొత్తాన్ని 10 చేత గుణించు.
నువు ఎంచుకున్నది ఆపంక్తిలో ఎన్నో మాటో ఆ సంఖ్య కలుపు.
అందులోనుంచి 250 తీసివెయ్యి.

ఇప్పుడు చివరకు నీకు వచ్చినసంఖ్య ఏమిటో నాకు చెబితే, నీవు ఎన్నోపేజీలో, ఎన్నోపంక్తిలో, ఎన్నోమాట తలచుకున్నావో చెబుతాను. 55-వ పేజీలో ఉదాహరణగా చేసిన లెక్క వున్నది చూడు.

## చందమామ బొమ్మల పజిలు

ఈ నెలనుండి చిత్రమైన బొమ్మల పజిలు ప్రారంభిస్తున్నాము. ప్రక్క పేజీ చూడండి. ఇందులో పజిలు, దాని చుట్టూ 12 బొమ్మలు ఉన్నాయి. ఒక్కొక్క మాటకు బదులుగా ఒక్కొక్క బొమ్మ కనపడుతున్నది. ప్రతి బొమ్మలోనూ నిలువుకాని, అడ్డుకాని ఆధారములు కూడ వేసి ఉన్నయి ఈ ఆధారముల సహాయముతో బొమ్మలకు సంబంధించిన సరి ఐన మాటలేవో తెలుసుకోవాలి. ఉదాహరణకు 1-అ, అని వ్రాసి ఉన్న బొమ్మ చూడండి. చూడగానే మీకు 'కొంగ' అనేమాట తట్టుతుంది. కాని, 1-అడ్డము మూడు అక్షరాల మాట కనుక కొంగ అనే రెండక్షరాల మాట సరిపోదు. కనుక కొంగ అని అర్థమిచ్చే 3-అక్షరాలమాట ఏమిటా అని ఆలోచిస్తే 'బకము' అని స్ఫురిస్తుంది. అప్పుడు ఆ మూడు గళ్లల్లో 'బకము' అనే అక్షరాలు వ్రాయండి. ఇలాగే బొమ్మల ఆధారంతో తక్కినవాటికి సంబంధించిన మాటలు ఆలోచించి పూర్తిచేయాలి.

జవాబుకి 55-వ పేజీ చూడండి.

49-వ పేజీలోని బొమ్మలకి జవాబు:

1. చంచువు ; దర్పణము ; మామిడికాయ ; ముత్తేభము — చందమామ
2. ఆలయము ; లోచనము ; చదరములు ; నమస్కారము — ఆలోచన
3. పావురము ; దర్పణము ; పవనము ; ముల్లంగి — పాదపము
4. పర్వతము ; వరాహము ; నది ; ముని — పవనము

# చందమామ బొమ్మల పజిలు

1.అ.



5.ని.



4.ని.



4.అ



9.అ.



11.అ



7.అ.



8.అ.



| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ■ | ■ | 1 | 2 | | ■ | ■ |
| ■ | ■ | ■ | | ■ | ■ | ■ |
| 3 | ■ | 4 | | 5 | ■ | 6 |
| 7 | | | ■ | 8 | | |
| | ■ | 9 | 10 | | ■ | |
| ■ | ■ | ■ | | ■ | ■ | ■ |
| ■ | ■ | 11 | | | ■ | ■ |

2.ని.



10.ని.



6.ని.



3.ని.





# పిల్లల పెంపకం

తల్లులకు మాత్రము

## ఆహారము: తల్లి పాలు

ఆహారం అనేక రకాలు. అన్నిటిలోకి ప్రాణశక్తిని ఇచ్చే ప్రధానవస్తువు పాలు. పాలలోకల్లా ముఖ్యమైనవి తల్లి పాలు. తల్లిపాలు పిల్లలపాలిటి కల్పతరువు అన్న మాట. నిజానికి పిల్లలు తాగిన చనుబాలనుబట్టే పెద్ద అయినతరువాత వారి బాగోగులు ఏర్పడుతై. కనుకనే, గొప్ప పోషకశక్తిగల తల్లిపాలను పిల్లలు ఆరగించాలి.

తల్లిపాలయొక్క శక్తి ఎటువంటిదో చెప్పటానికి ఒకచిన్న ఉదాహరణవున్నది చూడండి: అంజనేయుడు పుట్టీ పుట్టడంతోనే సూర్యుణ్ణి చూచి పండుఏమో అనితలచి పట్టబోతాడు. ఆతనిపట్టునుంచి సూర్యుణ్ణి తప్పించటానికి ఉపాయంలేక ఇంద్రుడు తన గదను అంజనేయునిపైకి విసురుతాడు. ఆదెబ్బ అతని మూతికి తగిలి, ఆంజనేయుడు సొమ్మసిల్లి పడిపోతాడు. ఆంజనేయుణ్ణి చూడటంతోనే తల్లి అంజనాదేవికి పాలు చేపు వస్తాయి. అవి పెల్లుబికి, కొన్ని చుక్కలు భూమిమీద పడతాయి. ఆ చనుబాల చుక్కల శక్తికి అక్కడ భూమి బ్రద్దలై, పాతాళందాకా పగులు వారుతుంది. ఇంతటి బలం వున్నది తల్లి పాలకు. తల్లిపాలు అనేకమైన ఔషధీగుణాలు గల పూర్తి ఆహారమని వైద్య శాస్త్రజ్ఞులు రూఢిపర్చారు.

ఇటువంటి మహత్తరమైన పాలిచ్చి బిడ్డల్ని పెంచుకోవటం మానివేస్తున్నారు కొందరు తల్లులు. తల్లిరొమ్ములో భద్రపరుపబడినటువంటి అమూల్యమైన క్షీరాన్ని శిశువుకి అందియ్యక పోయినట్టయితే ఆ తల్లి పసికూన నోటిముందటి కూడు పడగొట్టి, నూరేళ్ళు బతకవలసిన శిశువుయొక్క ఆరోగ్యం మొదటిలోనే పూర్తిగా చెడగొట్టుతున్నదన్న మాట. కనుక ఈ ముఖ్య విషయాన్ని మనస్సులో గట్టిగా నాటించుకొని, చిన్న బిడ్డలను చేతులారా పెంచుకోవటం నేర్చుకొనమని తల్లులకు నా సలహా.

'మీ పెద్దమ్మ'

# అట్టమీది బొమ్మ

అతి భయంకరమైన కేశినికూడ శ్రీకృష్ణుడు అవలీలగా చంపివేశాడని తెలియగానే కంసుడు తీవ్రాలోచనలో పడ్డాడు. కృష్ణబలరాముల పీడ వదిలించుకోవటం ఎలాగా అని అతని మనసు ఆరాటపడకొచ్చింది.

'ధనుర్యాగం' అనేటటువంటి మహా యజ్ఞానికి గొప్ప ఏర్పాట్లు చేయించాడు. ముష్టియుద్ధంలో ఖ్యాతిపొందిన వీరులను తయారుగా ఉంచాడు. 'కువలయపీడనము' అనే భీకరమైన దుష్ట ఏనుగను సిద్ధపరిపించాడు. తనకు నమ్మిన బంటు ఐన అక్రూరుణ్ణి రప్పించి కృష్ణునిపై ప్రేమ చూపించి అతనితో 'తక్షణమే పోయి ఎలా ఐనా సరే కృష్ణ బలరాములను వెంటబెట్టుకు రావలిసింది. ఈ పని నెరవేర్చటానికి నీవే తగినవాడవు' అన్నాడు.

అక్రూరుడికి గట్టి ఇక్కట్టు వచ్చింది. అతను దయార్ద్ర హృదయుడు. ఒకరిని నొప్పించటానికి అతని మనసు ఎంతమాత్రము ఇష్టపడదు. పైగా అతను గాఢమైన కృష్ణభక్తుడు. అటువంటప్పుడు శ్రీకృష్ణుణ్ణి బంధించి దుష్టుడైన కంసుని చేతులలో వప్పజెప్పటం ఎలాగా?—ఐతే యజమాని ఐన కంసునిమాట కాదనటానికా వీలులేదు. ఈ పరిస్థితిలో ఏమీ పాలుపోలేదు.

మరునాడు ఉదయానే కంసుడిచ్చిన రథంమీద అక్రూరుడు బయల్దేరి బృందావనమునకు సాగిపోయాడు. వెళుతూ దారిలో 'ఆ కృష్ణపరమాత్మని దర్శన భాగ్యం నాకు కలగబోతూవుంటే విచారమెందుకు? నా ధర్మం నేను నెరవేర్చుకుంటాను. నేను నిమిత్తమాత్రుణ్ణేకాని కృష్ణుణ్ణి నేను పట్టి ఇచ్చేవాడినా? అవతారమూర్తి ఐన ఆ భగవానునికి ఈపాటి తెలియదా?' అని ఇలా అనుకొంటూ పోయి నందుని ఇంటిముందు రథం నిలిపాడు. శ్రీకృష్ణ బలరాముల దర్శనం కావటంతోనే అక్రూరుడు పరవశుడై అతిభక్తితో అమాయిక హృదయంతో వారికి సాష్టాంగపడ్డాడు. ఇంతకాలానికి వచ్చిన తన ఆప్త మిత్రుణ్ణి శ్రీకృష్ణుడు ఆప్యాయంతో చేరదీసికొని కుశలప్రశ్నలు వేయగా అతను కంసుని కుటిలవర్తనమంతా భగవానునికి వెల్లడించాడు. ఏమీ ఎరుగనట్లు శ్రీకృష్ణుడు ఆ సంగతులన్ని ఆసక్తితో వినేదంగా వినజొచ్చాడు.



# ఇంద్రజాలము

ఒక తగ్రపుల్ల చివర దారంతో ఒక ఈల వ్రేలాడకట్టి సభవారికి చూపిస్తాను. వారు వీటన్నిటినీ పరీక్షచేసి వీటిల్లో మాయ ఏమీ లేదని నిశ్చయించి తిరుగా ఇచ్చివేస్తారు. అప్పుడు నేను "అయ్యా! మీకు తోచిన ప్రశ్నలు వేయండి. వాటికి ఈల 'అవును' 'కాదు' అని సమాధానం చెబుతుంది. మీరు అడిగిన ప్రశ్న సరియైనదైతే సమాధానంగా ఈల ఒకటి రెండుసార్లు ఊదుతుంది. కాని వేసినది చొప్పదంటుప్రశ్న ఐతే, అదేపనిగా ఊదుతుంది.

—ఉదాహరణకు—'ఆదివారము సెలవు రోజా?' అని ఎవరైనా అడిగితే అందుకు బదులుగా నాఈల ఒక్క కూత కూస్తుంది. ఇంకొకరు "దోమకంటె ఏనుగ ఏపాటి పెద్దది?" అని అడిగా రనుకోండి. ఇది చొప్పదంటు ప్రశ్న గనుక నా ఈల అదేపనిగా మ్రోత పెడుతూ కూస్తుంది." అని చెబుతాను.

పోతే—దీని రహస్యమేమిటీ అంటే: నిజానికి మంత్రదండానికి వేలాడగట్టిన ఈల అసలు పలకనే పలకదు. నా కోటు లోపల దాచివుంచిన మరొకఈలపైన నేను చెప్పిన మోస్తరుగా శబ్దంచేస్తూవుంటుంది. ఇదే నేను తయారుచేసి ఉంచుకొన్న మాయఈల అన్నమాట. దీనిమూతికి ఒక రబ్బరుగొట్టం తొడుగుతాను. రబ్బరు గొట్టానికి చివర ఒక గుండ్రటి రబ్బరుతిత్తి అమర్చబడి వుంటుంది.



ఇప్పుడీ మాయఈలను రహస్యంగా కోటుమడతలో పెట్టుకోవాలి. రబ్బరు తిత్తిని చంకలో అమర్చుకోవాలి. మంత్రదండమునకు వేలాడగట్టిన ఈల ఒక

మాయ ఈల



చేతిలో సభవారికి కనపడేటట్టు అలానే పట్టుకుని ఉండాలి. రెండవ చంకకింద రబ్బరుతిత్తిని రహస్యంగా దాచిపెట్టుకో



వాలి. తర్వాత సభవారు వేసే ప్రశ్నలని బట్టి చంకకిందవున్న రబ్బరుతిత్తిని ఒక్కసారి నొక్కి వదలటమో, లేక అదేపనిగా నొక్కివుంచటమో చేస్తూవుండాలి. రబ్బరు గొట్టం ఎక్కువ పొడవుగా ఉండనక్కరలేదు. మామూలుగా బజార్లో అమ్మే రబ్బరు బంతిని తెచ్చి, తిత్తిగా అమర్చుకోవచ్చు.



[ఆసక్తిగల పాఠకులు, ఈ గారడీనిగురించి ఉచితంగా సలహాలను పొందదలిస్తే, వారు 'చందమామ' పత్రికపేరు ఉదహరిస్తూ ప్రొఫెసరు గారికి వ్రాయవచ్చు. మీరు వారికి ఉత్తరాలు ఇంగ్లీషులోనే వ్రాయాలి. వారి అడ్రసు యిదిః—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మేజిషియన్

పోస్టుబాక్సు 7878, కలకత్తా—12.]



### పేజీ, పంక్తి, మాట చెప్పటం ఎలాగ:

నీవు 53-వ పేజీలో, 7-వ పంక్తిలో, 5-వ మాట ఎంచుకున్నావనుకో.

| | | |
|---|---|---|
| నువ్వు ఎంచుకున్న పేజినంబరు 53. | | |
| దాన్ని రెట్టింపుచేస్తే | 106 | వస్తుంది |
| 5 చేత గుణించితే | 530 | ,, |
| దానికి 20 కలిపితే | 550 | ,, |
| దానికి నువు ఎంచుకున్న పంక్తిసంఖ్య కలిపితే | 557 | ,, |
| దానికి 5 కలిపితే | 562 | ,, |
| దాన్ని 10 చేతగుణించితే | 5620 | ,, |
| దానికి నువు ఎంచుకున్న మాట ఆ పంక్తిలో ఎన్నోమాటో కలిపితే | 5625 | ,, |
| ఇందులోనించి 250 తీసివేస్తే | 5375 | ,, |

ఈ అంకెవల్ల 53-వ పేజీ అనీ, 7-వ పంక్తి అనీ, 5-వ మాట అనీ చెప్పెయ్యవచ్చు.

### బొమ్మల పజిలుకు జవాబు:

| అడ్డము: | నిలువు: |
|---|---|
| 1. బకము | 2. కత్తెర |
| 4. కరము | 3. శుకము |
| 7. కన్నులు | 4. కలువ |
| 8. ఖరము | 5. ముఖము |
| 9. వటము | 6. పాములు |
| 11. వేకువ | 10. టముకు |

